శ్రీ బసవపురాణము.

సకలతీర్థములకుజనయిత్రియగుచు। ప్రకటింపనొప్పుశ్రీపర్వతేంద్రంబు। మహి
తత్పర్వతసార్వభౌమునకు। పూర్వవక్త్రాంకవిస్ఫురణందొలఁకాడ। నొలసికుమా
రశైలోత్తంసలీల। దిలకించిపెంపారుత్రిపురాంతకంబు। తత్త్రిపు రాంత
స్థానవాస్తవ్య। దైత్యత్రిపురాంతకుఁడభినుతిబేర్మి। నాపురసంహారునపరావతా
ర। రూపితఖ్యాతినిరూఢిదలిర్చు। నాసదాశివమూర్తియధిగతైశ్వర్యభా
సురచరలింగపటుదీప్తిబరగు। నాకాలకంఠుననవద్యహృద్య। సాకారవిభ్ర
మవ్యాప్తింపారు। నాదేవువీరవ్రతాచారసార। మేదురస్ఫురణమైమించివె
లుంగు। జంగమరత్నంబుశరణసమ్మాన్యుఁడు। లింగైకవర్గతాంగవికారి। పం
డితారాధ్యకృపాసముద్గతుఁడు। మండితసద్భక్తిమార్గప్రతా[illegible] విలసితప
రమసంవిత్సుఖాంభోధి। నవిగరస్థసోమనాథయ్యగారు। బసవనికారుణ్య
రససుధావార్ధి। ననదృశలీలనోలాడుచునిత్య। ని[illegible]మపవిత్రాధికనిరుపమ ని
[illegible] క్రియయగ్గోనదత్త్వనిర్ణయముసంధిల్ల। నతులగోష్ఠిసుఖస్థితిబేర్చ భక్తిమతి
నియమంబులమల్లినాథుఁడును। యాదివేదోక్తవేదాంతసిద్ధాంత। వేదశాస్త్ర
పురాణవిహితమార్గమున। తనుమనోధనసనివేదనసమగ్రతను। పనిగొనిజం
గమార్చనలుసేయుచును। శీలంబుదనరశివమాలంఘనవ్ర। తాలంకృతినిబేర్చి
యాచారలీల। యసలారగాగుమారాద్రికీర్తిపూర్ణ। దెసనుసోపానముల్ దీ
ర్చిపొల్పారు। మహితసద్భక్తసమంచితవృత్తి। మహిజను రెంటాలమల్లినాథుడు
ను। నిరతిశయప్రీతినిత్యంబునైదు। కరవీరపుష్పముల్ హరునకర్పింప। నొక్క
నాఁడొకదండులెక్కవమైన। గ్రక్కునదనసేత్రకమలమర్పించి। భక్తుని చేన
సదృశాంబకమప్పుడడసి। ధ్రువకీర్తిబేర్కొన్నదోచమాంబయును। ధీరుండు
మున్నయుదేవయోగీశు। సూరిమిశిష్యుండు నారయాంకునకు పుత్త్రుండు పరమ
పవిత్రుండువిమల। గాత్రాంచితుడు నీలకంఠాగ్రజుండు। జగదభినుతుడుప్రి
సాదావధాని। నిగమార్థవేత్తగోడగిత్రిపురారి। లోనుగానఖిలభక్తానీకమె
లమి। మానితభక్తిసామ్రాజ్యసంపదలు। జిలిబిలిబోవంగచిరతరమహిమ।నల
రారుచుండంగనందొక్కనాడు। మండితాసంఖ్యాతమాహేశ్వరులకు। దండ
మయ్యొప్పగాతగనాచరించి। భక్తదయారసపరమాప్త్యాభి। షిక్తుండనైసు
[illegible]సదృశంబైయొప్పుబసవపురాణ। మెసకంబులోఁజెప్పనిష్ట
తోననుచు। సన్నుతిజేయు[illegible]వెరవరిగించి। చరితార్థుజేయరే కరుణ
హృష్టరించి। సముదితప్రీతిబ్రసాదావలోకనమున। విన్నవించుడు భక్త వితతి
[illegible]చిల్లంగనన్నువీక్షించి। బ

శ్రీ బసవపురాణము.

సవపురాణంబుపసరించుశక్తి । యసలారనొసగితిమల్లిగావునను । రచియిం
చుబసవపురాణంబునీవు । నచలితభక్తిహితార్థంబుగాగ । నావుడుభక్త జ
నావలియాజ్ఞ । వాపిరిదలమోచివర్ణించుగవిత ॥ పాటింపదగినగర్ణాట భూ
మికెసి । కోవిదమైయొప్పగొబ్బూరనంగ । నాయగ్రహారమహా జనోత్తమని
కాయపూజితపాదకమలద్వయుండు । శాంభవవేధదీక్షాసద్విశేష । సంభావి
తాశ్రితజనసముత్కరుడు । సురుచిరప్రణవపస్ఫురితోపదేశ । చరితార్థజనసఖి
లశిష్యప్రతానుండు । కింకరనిచయహృత్పంకేరుహాంత । రాంకితవరసచ్చిదా
నందమూర్తి । పాత్రుండుభవలతాదాత్రుండువిషయ । జైత్రుండువిమలచరి
త్రుండుసకల । భువనపావనమూర్తిబుధచక్రవర్తి । ప్రవిమలకీర్తి సద్భ
క్తిపరిపూర్తి । యనిపినుతించగనాచార్యమహిమ । మనుచుండుభక్తులమాదిరాజ
నగ । నామహాత్మునిసముద్యత్కృపాపూరి । తామృతహస్తకృతావతారుం
డు । నాగురుదేవపాదాబ్జసౌరభ్య । భోగలీలావరపుష్పంధయుండు । నాశి
వయోగియుదాత్తమూర్తిప్ర । కాశితహృత్పద్మకర్ణికాంతరుడు । నాదివ్యదే
హుడయాకలితప్ర । సాదపాదోదకాస్వాదతత్పరుడు । గురుపరతంత్రుండు
గొబ్బూరివిభుడు । పరమశివాచారపథవర్ధనుండు । లింగైకనిష్ఠావిహీనమాన
సుడు । సంగనామాత్యుండుజగదుపకారి । యనియిట్లుభక్తసభాభ్యంతరా
ళ । మునసనిమ్న జెప్పగవినిలసత్ప్రీతి । పసరింపబంగముభక్తుండవనియు । బస
వపురాణైకపాత్రుండవనియు । నచలితప్రీతిమాకనుగులంబనియు రచియిం
తుబసవ పురాణసత్కవిత । యవధానవంతులై నెమ్మివినుము । సవిశేషభ
క్తిమైసంగనామాత్య ॥ ధరనుమామాతాపితారుద్రియనగ । బరగువేదోక్తినీ
శ్వరకులజుండ । శరణగణాశ్రియసకలస్వరూప । గురులింగవరకరోదరజని
తుండ । భక్తకారుణ్యాభిషిక్తుండబాశ । ముక్తుండగేవలభక్తి గోత్రుండు ।
భ్రాజిష్ణుడగువిష్ణురామదేవుండు । తేజిష్ణువగుశ్రియాదేవియమ్మయును । గార
వింపగనొప్పగాదిలిసుతుడ । వీరమాహేశ్వరాచారవ్రతుండ । ఖ్యాతి[illegible]సద్భ
క్తిగలకట్టకూరి । పోతిదేవునిపదాంబుజషట్పదుండ । సుకృతాత్మడగుకరస్థల
మువిశ్వేశు । ప్రకటవరప్రసాదకవిత్వయుతుడ । వడగామురామేశువరశిష్య
డనగ । బడుచెన్నరామునిప్రాణసఖుండ । సంభావితుడభవిజన సమాచరణ ।
సంభాషణాదిసంసర్గదూరగుడ, సలిబాల్కురికిసోమనాథుడనంగ వెలసిన
వాడనిర్మలచరిత్రుండ । సురుతరగద్యపద్యోక్తులకంటె । సరసమైపరిగినజాను తె
నుంగు । చర్చింపగాసర్వసామాన్యమగుట । గూర్చెదద్విపదలుగోర్కెదైవార

తెలుగుమాటలనంగవలదు వేదములకొలదియ కాజూడుడిలనెట్టులనిన । పా
టితూమునకునుపాటియానేని । పాటింపసోలయుపాటియుకాదె । యల్పాక్ష
రములన నల్పార్థరచన । కల్పించుటయెకాదెకవివివేకంబు ! నలరుచుబసవని
తలచుతలంపు । బలువునగాజేసిభావముల్మెరసి । యకలంకలింగరహస్య సి
ద్ధాంత । సకలశాస్త్రపురాణసమ్మతంబైన । యాతతబసవపురాతనభక్త । గీ
తార్థసమితియేమాతృకగాగ । పూరితంబైయొప్పుపూసలలోని । దారంబు
క్రియబురాతనభక్తవితతి । చరితలలోపలసంధిల్లుబసవ । చరితమేవర్ణింతు
సత్కృతియనగ । ససదృశలింగదేహాసుడైయున్న । బసవనివేరొక్క భావం
బుగాక । తగిలివర్ణించుటతప్పనవలదు తగుభక్తవర్థనార్థంబుగానగుట!
బసవనిశరణన్నబాపక్షయంబు । బసవనిశరణన్నబరమపావనము । బసవనిశ
రణన్నబ్రత్యక్షసుఖము । బసవనిశరణన్నభవరోగహరము । బసవనిశరణన్నభ
క్తిచేకూరు । బసవనిశరణన్నబంధముల్వాయు । బసవనిరశరణన్న భాగ్యంబు
వొందు । బసవనిశరణన్నబరగుశీలంబు । బసవనిశరణన్నబాయునాపదలు । బ
సవనిశరణన్నబ్రబలుసంపదలు । బసవనిశరణన్నపసలారుగీర్తి । బసవనిరణ
న్నఫలియించుగోర్కె బసవనిశరణన్ననెగడువాక్సిద్ధి । బసవనిశరణన్నభ్రాజి
ల్లుబుద్ధి । వేమేలముచుబసవాయనబరగు । నీయక్షరత్రియంబిల్లోకమాటు।
చదువునెవ్వండేనిముదముతోసతని । వదనంబుశివునకుకుదురుతానగ । పా
యకబసవనిబ్రస్తుతించినను । బాయుటచోద్యమే భవబంధనములు । బసవ
డుకేవలభక్తుడేతలప । ససమాత్ముడారూపమైనిల్చెగాక । బసవడువసుధపై
బ్రభవించునంత । బసవనిజనుడనిపలుకంగదగునే । హరుడునిరాకారుడైనచో
బసవ । డరయంగసాకారుడైచరియించు । హరుడుసాకారుడై యులరుటజూ
చి । శరణుడైబసవండుసందులేకుండు । శరణుడైపరముండు సరిసైలకొనిన ।
పరమభక్తస్థితిబసవన్నకొలుచు । భక్తుడైలింగంబు ప్రకృతిచేకొన్న । వ్యక్తి
గాబసవన్నవరువుడుసేయు । పరమాత్మరూపంబుబసవడేమెరుగు । పరమే
శుడెరుగువాబసవనిరూపు । సాలోక్యసామీప్యసారూప్యపదవు । లోలినిపొం
దసాయుజ్యంబునొంద ! వచ్చుగాకిలబసవస్వామిగాగ । వచ్చునేపెర పెరవా
రలకెల్ల । ప్రమథాగ్రిగణ్యుండుబసవడీశునకు । సేమసినభక్తుండుజంగమంబు
లకు । లింగదేవునకునునుంగుబసవడు ! జంగమ కోటికి సడసన్న దాసీ
యొక్కంగ వాహనం బెప్పుడీశ్వరున । కెక్క సింహాసనం బీతు భక్తుల
కు । కాలసంసరుకరవాణిబసవన । శీలంపుభక్తులచేతియద్దంబు । బసవని

నేరికి! బ్రస్తుతి సేయ । వశమె బసవని నెవ్వరికి నెరుంగ । సంపన్నుఁడై లిం
గ జంగమంబందు। బొంపిరిగొని పువ్వు। గంపునై యుండు। గావున బసవని। గణు
తింపరాము। దేవాసురులకైన। డెల్లమై యుండు। నెన్నంగ వేడ్క కా। దెరుగు సే
దోస। మన్నట్లు గాక నా యువని గీర్తింప। నిదియు కోటికి పడగెత్తినవాని । బడి వే
లకాపవై బ్రతుకుమన్నట్లు। లాపరంజ్యోతిస్స్వరూపంబునకును। దీపపుఁగంబమె
త్తించినయట్లు। భవనిర్మితములైన పత్రపుష్పములు। భవునకు దగ సమర్పణ సే
యునట్లు। గాక కీర్తింతు నా గానాతరంబె। ప్రాకటంబగు భక్తభండారిచరిత। మై
నను భక్తిహితార్థంబు గాక। నానేర్చు భంగి వర్ణన సేయువాడ। నవరసరసిక
తఘవిని బేర్కొన్న। శివకవిప్రవరుల చిత్తంబులలర। నెప్పాటనితరుల జెప్పెడిదే
మి। తప్పులు దారులు తడబడబలికి। వెలసిన చదువులు వీటువోరిత్త। పొలసిపోయి
రితమపురులుదులగను- మృడుమహత్వము గానమిని బొంకులన। బడుకవయుక్తి
స్నపశ్యంతియును। ననుచు కుకవుల గీటునబుచ్చి పేర్చి। వినుపింతు తత్కథా విధ
మెట్టులనిన॥

శ్రీరజతాచలశృంగంబునందు। మారారియుమయును మానవక్రీడ। న
గిలినసుఖసత్కథావినోదమున। సాగయుచును న్నెటశుద్ధశివైక। మానసులగు
నుపమన్యుడు భృంగి। యానందికేశ్వరుడాదిగాగలుగు। ప్రమథులు గొలువగ బరిమి
తంబైన। సమయోచితమెరింగి చను దెంచె ప్రీతి। నారదుడను మునినాయకోత్తము
డు। ధారిసర్వాంగముల్ భువినొంద మ్రొక్కి। ముకుళితహస్తుడై మ్రొక్కుచు మరి
యు। సకలలోకాలోకచరితంబులెల్ల। విన్నవింపగనున్నక న్నెరింగతని। వెన్నెల
గలకంటవీక్షింపుచున్న। యవసరోచితమున నంబికాదేవి। శివునను మతమున జే
సన్నబిలిచి। పోయివచ్చిన కార్యములు విన్నపంబు। సేయుమీవున్నట్లు శివునిమున
నిని। నమ్మనీశ్వరుడు మహాలింగదేవు। నమ్ముఖుడై కరాబ్జమ్ములు మొగిచి। సకలలో
కాలోకచరితంబులెల్ల। ప్రకటితభక్తనెప్పటియట్లబరగు। నరలోకమునను మా
నాధ మీ భక్తి। చరితమేమియును। విస్పష్టంబుగాదు। తవిలి శివాచారతత్పరత్వ
మున। భవులతో కొందరు బలుకకున్నారు। లోకప్రపంచంబులో గొందరుండి।
లోకబోధకులోను గాకున్నవారు। మరికొందరానందమగ్నులై తమ్మ। మరచి

లోకములకు మఱుపడ్డవారు। నున్నతసద్భక్తియుక్తులై కొందఱున్నారు తమతమ
యడఁకువఁ బాఁచి। యిదికారణముగాక యీశ మీభక్తి। తుదమొదలిదియని తోఁచ దెవ్వ
రికి। నందు దృష్టప్రత్యయంబులవలన। సందియంబులు దక్కి సద్భక్తియుక్తి। సుస్థి
రంబులగు లింగస్థలజంగ। మస్థలతత్ప్రసాదస్థలంబులను। సంపన్నులై జగజ్జను
లెల్ల భక్తి। సొంపు రంజిల్లఁ బ్బ నబ్బారల చేల। నీవే ప్రసన్నుండవై వచ్చి లోక। పావనం
బుగ భక్తి పాలింపవలయు। ననివిన్నవించిన దేవదేవు। డనురాగచిత్తుఁడై యతని
కిట్లనియె। నందికేశ్వరునకు నాకు నొక్కింత సందు లేకునికి నిస్సందేహమగుట। నీ
తనిఁ బుత్తెంతు నితనిచే బరమ। పూతమై లోకంబు బోధింపఁబడును। ననువుడు గిరిరాజ
తనయాప్రాణేశు। గనుగొని ముకుళితకరకంజయుగుచు। నందికేశ్వరునకు నాకు
నొక్కింత। సందులేకునికి నిస్సందేహమగుట। భక్త్యైకతనుడవై పలికినవిధమొ।
వ్యక్తిగా నతఁడు నీవై యున్నవిధమొ। యానతీయుమ్మన నంబిక యడుగ। నానార
దుఁడు విననభవుఁడిట్లనియె। నగునగు నట్టిదయాంబుజనేత్ర। తగుతగు భక్త్యైకతనుఁడ
నట్లగుదు। చెప్పెద వినుము విశేషమిం కొకటి। తప్పదే నతఁడని తరికించి చూడ। నే
మికారణమని నెఱదవేని వినుము। తామరసాననతత్కథాయుక్తి। యాదిననేక
యుగాదులనాఁడు। నాదరికను శిలాదుండు నాఁగ। తాపసముఖ్యుండు తపము
నరించె। శ్రీపర్వతంబు నైఋత్యభాగమున। కందమూలాదులు గాలియు నీరు।
నిందురస్ములని నేశరస్ములును। నాహారముగ త్రికోట్యబ్దముల్ సలిపి। సాహాస
మునమరిశతకోటి యేడు। లావంక శిలాతనకాహారముగను। భావించి ఘోరతపం
బగ్గి సేయ। నతనికి ప్రత్యక్షమై యేమునిలిచి। మది నిష్టమెయ్యది మము వేఁడుమనిన।
నత్తరి నతఁడు సాష్టాంగుఁడై మ్రొక్కి। చిత్తంబులో బ్రీతి చిగురొత్తనిట్లు। సర్వజ్ఞ
పశుపతి శంకర శర్వ। సర్వలోకేశ్వర శాశ్వత సాంబ। యవధారు వేదవేదాంతా
వగమ్య। యవధారు విన్నపం బాశ్రితసులభ। శ్రీమన్మహాదేవ శివలింగమూర్తి।
యేమిట [illegible]త యేస్వామి మీకృపను। నైననునాకొక్క యభిమతంబైన। దానివే
డెదమహాదానియీక్షణము। నీపుట్టివానిని నిజభక్తజనప। రాయత్తుసుతుగా
దయామతి నొసగు। మనవుడు నతనికి నభిమతార్థంబు। లొనరింపనున్నంతవ
నజాక్షిఁ వినవె। యంతటఁ బోవక యాశిలాదుండు। నెంతయు భక్తితో నిలజాగి

క్రమెఁకిఁ। యభిమతంబగు పుత్రు నర్థి నిత్తేని। యభవ నీభక్తియం దణుమాత్రమైన।
దక్కువయైన నుతలఁ ద్రుంచివైతు। నక్కుమారునకు నీవడ్డమైయున్న। నట్టేని సు
తునినిమ్మటు గాని నాఁడు। నెట్టన నేనొల్ల నీయిచ్చువరము। నంచు విన్నపమాచ
రించుడు నతని। నంచితభక్తికి సంప్రీతిఁ బొంది। యాదిసృష్టికనిమున్నాదిదైవపరగు।
నాదు మదీయాంశమగు ఋషభంబు। ధర్మరూపంబున గృతయుగంబునందు। ధ
ర్మంబు నాల్గుపాదంబుల నడచు। రమణతోఁ ద్రేతాయుగమునను ధర్మ। మమరఁగ
మూఁడు పాదములను నడచు। జగములో ద్వాపరయుగమందు బాద। యుగళం
బు ధర్మనియుక్తమై నడుచు। బొనరుచు గలియుగంబున నొక్కపాద। మున నచరిం
చు ధర్మవునన వెలసి। తగిలి యిమ్మాడ్కి నిధర్మస్వరూపు। డగుచు లోకహితార్థు
డగు నట్లుగాక। పూని ద్వితీయ శంభుఁడని పేర। మాకు వాహనమై ప్రమథముఖ్యు
డయ్యు గోకులపతియయ్యు శ్రీకరమహిమ। వెలసిన నయ్యాదిఋషభేంద్రుఁ జూ
చి। నలిశిలాదునకును నందీశుఁడనఁగ। పుట్టు మునీవాండె పుట్టంగవలయు। నట్టుగా
కే నొండె పుట్టంగవలయు। రూపించి ధర్మస్వరూపివై మహిమ। నేపారఁ బ్రమథగ
ణేంద్రులం డెల్ల। మక్కువ పెక్కువ మాభక్తి యుక్తి। మెక్కువగాఁగ నీకిచ్చిన
వాఁడ। గాన మిక్కిలిభక్తిగలయట్టిపుత్రు। గాని శిలాదుఁడు దానొల్లనన డె। యిచ్చి
న వరమిఁక మేదప్ప నేర। నచ్చెరువంద మాయనుమతి జేసి। బుట్టు ద్వితీయశంభుఁడ
యనిబుడమి। నట్టిద కాక నియానందలీల। బుట్టెన యోనిసంభూతుఁడై యతని। కిట్టలం
బుగ నందికేశ్వరుఁడనఁగ। పుట్టగ తోడన పుట్టె మద్భక్తి। పుట్టకయట మున్నె పుట్టె
మచ్చింత। పరమతత్త్వామృతంబ యొచన్నుబాలు। గురుపదధ్యానవిస్ఫురణమే
వెన్న। వేదాంతసూక్తులు వెడదొలుకుఁ బలుకు। లాదిశివాచారమదియ వర్తనము।
గాను మదీయాంఘ్రికమలంబు లాత్మ। లోనిడికొని భక్తిలోలత్వమెసఁగ। బలువిడి
బారు నేరుల నట్టనడుమ। జలికాల మెల్లఁ బుక్కిలిబంటిఁ నిలిచి। యేకపాదాంగుష్టమి
లమీఁద మోపి। యాకసంబునకు ముఖాంబుజం బొగ్గి। వర్షంబు బోరన వలగొని కురి
యు। హర్షణంబుతోడ నల్లాడక నిలచి। మేదినిదల మోపి మీఁదికి రెండు।
పాదంబు లెత్తి కొపంచాగ్ని నడుమ। దలచిన డెందంబు తాపంబు
బొంద। బలికిన నోరెల్ల బటపటబగుల। చూచిన రెప్పలు సురసురగమర।

నేచినయండల నెడపకనిలచి। భువియువడంకనంబోనిధులింక। రవిశశుల్ గ్రుం
కగూర్మంబుదలంక। దిక్కరీంద్రులు దుంగదిక్కులుగ్రుంగ। నక్షులాద్రులుస్రగ్గ
నహిపతిమ్రొగ్గ। దిక్పతుల్ చెదర నద్రివియల్లవదర। వాక్పతియదరనధ్వరములు
బెదర। హరితల్లడిల్ల బ్రహ్మాండముల్ డొల్ల। ధరనులకములువల్లసురలుభీతిల్ల। న
కురిమితంబైనయతివీరఘోర। తపమాచరించె చిత్రము చిత్రమనగ। నంతభూమి
భ్రాంతులైయజాచ్యుతులు। సంతాపచిత్తులైసకలదేవతులు। గ్రక్కునమాయయు
న్నకడకునేతెంచి। మ్రొక్కిసాష్టాంగులై మోడ్పుగేలమర। దేవదేవేశ్వర దేవ
తారాధ్య దేవచూడామణి దేవాదిదేవ। పరమభట్టారక పరమస్వతంత్ర। పర
మేశ పరమాత్మ పరమ పరుండ । శంకర పంకజ సంభవాద్యమర।
శంకరదురిత భయంకర సకళ । యక్షయసర్వజ్ఞ యఖిలలోకైక । రక్షక
దక్ష మఖక్ష యదక్ష । యని మమ్ము గీర్తించు నచ్యుతాదులను
గనుగొనియేమనుగన్నులనవ్వి। యింతసంతాపింపనేటికిమీకు। భ్రాంతిదక్క
నవెఱ్ఱిపశుజీవులార। నందీశ్వరుడు సేయునవ్యతపంబు। చందంబుచూచియోశం
కించిరాక। చీరికిగైకొన్నె శ్రీపనీపదవి। కోరునే బ్రహ్మనీకొండికపదవి। యోరి
దేవేంద్రనీయొడుబడిపదవి। పేరతడెఱుగునే పెక్కులేమిటికి। ననుగానియాత
డునాపదంబైన। మనసునదలపడు మాభక్తులాన। యనుచు బ్రసన్నుండవై యేను
ఞారి। మనములదిగులెల్ల మాన్పగదలచి। యందరుగొలిచిరానచటికిబోయి। నం
దికేశ్వరుడాయముందటనున్న। నతడంతరంగంబునందునగాంచు। గతితేటతె
ల్లమైకానవచ్చుటయు। నప్పుడచ్చెరుప్రహర్షంబుభక్తిముప్పిరిగొని మనంబునను
ల్లసిల్ల। సాష్టాంగమెఱగిపదంఘ్రికంజములు। హృష్టుడైనెన్నుదురిరియంగమ్రొ
క్కి। యానందబాష్పపూర్ణాస్యుడైకలయ। మేనురోమాంచసమ్మిళితమైతనర।
గద్గదకంఠుడైకరములుమొగిచి। తద్గతచిత్తుడైతాబ్రస్తుతింప। మెచ్చితివరముని
కిచ్చితివేడు। మిచ్చయయ్యదినందికేశ్వరయనిన। దరహాసకాంతివక్త్రముననవో
లాకడ। నరుదొందమాకునిట్లనివిన్నవించె। పెన్నిధియుండంగమన్నడుగుదు
రె। నిన్నొండువేడెడునిర్గుణిగలడె। పదవులుగిదవులు పనిలేవునీదు। సదమల
భక్తిబ్రసాదింపుదేవ। యనినగాఢాలింగనావలివతని। తనువునాతనువునబెన

గొల్పియంత। భవదీయగాత్రసంస్పర్శనసుఖము। నవకమెక్కఁగవాహనంబ
గుమిట్లు। నాదిమదీయవాహనమవునీవు। వేదాంతనుతమహా ఋషభేంద్రయను
చు। బ్రమథేంద్రపదవికి పట్టంబుగట్టి। యమితసర్వజ్ఞత్వమప్పుడిచ్చుటయు। నం
తట శ్రీధరుడంతటనజుడు। నంతట దేవేంద్రుడంతటసురలు। ధరఁజాఁగబడిమ్రొ
క్కి-కరములుమొగిచి। శరణంచునందికేశ్వరునిగీర్తింప। నతఁడుదయామతినల్లన
నగుచు। నతఁగులౌసురలనుసరవిరికంట। జూచెభయంపడుసురలతొల్లింటి- యే
చినభీతివోఁజూచినయట్లు- శ్రీగిరినైరుత్యభాగంబుపుణ్య। భాగసుక్షేత్రంబుపర
మపావనము। నందికేశ్వరునిపుణ్యతపంబుసేత। నందిమండలమనునామంబు
దాల్చె। నచ్చటవర్తించునఖిలజీవులకు। నిచ్చితిమపవర్గమిందీవరాక్షి। దొరకొ
నునందికేశ్వరుచరితంబు। విరచించువారికివిన్నవారలకు। నచలితబుద్ధిద్రుష్టాద్రు
ష్టసిద్ధి। ప్రచురవచఃశుద్ధిభక్తిసమృద్ధి। యిట్టిదకావున యీనందికేశు। డెట్టు
న్ననేనకాకెలమినొండొకఁడె। యనియానతిచ్చుడునఖిలాండపతికి। యనురాగ
మునజగదంబ కేల్మొగిచి। యన్నందికేశునందందఁజూచుచును। మన్ననదైవార
మరియునిట్లనియె। నీనిరహంకారమీసదాచార। మీనిరంతరభక్తియీప్రభుశ
క్తి। యీశిద్ధపాండిత్యమీనిత్యసత్య। మీసుకుమారత్వమీయాత్మతత్వ। మీశుద్ధ
చారిత్రమీపుణ్యగాత్ర॥ మీశుభాంచితమూర్తియీలసత్కీర్తి। యేరికిగల్గునేయ
న్నిభంగులను। గారవింపగనీవుగానివారలకునిన్నుభరింపగనీకెకాకొరుల। కె
న్నగశక్యమేయీశసర్వేశ। యట్టిదకాకనీయంశంబుగాని। యట్టివాడింతనీకను
గులంబగునె। యనుచున్నగిరిరాజతనయవాక్యములు। వినిముదితాత్ముడైవిశ్వే
శ్వరుండు। నారదుడెసజూచినందికేశ్వరుని। గారవమహిమవిఖ్యాతిగావించె।
యనుచునానందీశుయధికదయార్ద్ర। వనధిముంచుచుగనుగొనుచున్నయెడను
యంతయుభయమునొక్కింతయుచూపు। నెంతయుసిగ్గునొక్కింతయుముద
ము। తనకుభూషణములై తనరారుచుండ। కనుఁగవహర్షాశ్రుకణములుదొరఁగ।
సులభలోహాంఛకంచుకితాంగుడగుచు। తలపునడెందంబుతటతటనదర- మస్త
కవిన్యస్తహస్తుడైతన్ను। బ్రస్తుతింపుచునున్నప్రభునందికేశు। గనుసన్నచేసన్న
గదియంగబిలచి । తననిర్మలప్రసాదము గృపచేసి । నెయ్యంబు కరుణయు

ండే వెవ్వరియ। నయ్యంబికాధీశుడతనికిట్లనియె। నిదిశ్రుతిస్మృతిమూలమిదిధర్మ
శీల। మిదివిమలాచారమిదిపుణ్యసార। మిదిసుమహత్తత్వమిదికృతార్థత్వ।మిది
యాదిపదమనివిదితంబుగాగ। నీకతంబుననసిర్మితమైభక్తి। లోకంబునందవలో
కింపబడియె। ప్రమథాదిపతులకు పార్వతీసతికి। విమలమదీయతత్వముప్రబో
ధించు। తెరగునకంబెను తెల్లంబుగాగ। నెరిగించితిమినీకయెక్కుడుకూర్మి।నట్టి
దసర్వజ్ఞుడను పేరునీకు। నిట్టట్టనావలదెల్లచోజెల్లు। గానయామర్త్యలోకంబున
కరిగి। పూనిద్వితీయశంభుడనమహిమ। వ్యక్తిగాలోకహితార్థంబుగాగ। భక్తి
హితార్థంబుపరమార్థముగను। మావినోదార్థంబుమర్త్యంబుపరమ।పా
వనంబుగసేయుబసవడన్పేర। నావృషుగేల్మోడ్చినందికేశ్వరుడు। తావిన్నప
ముచేసెదేవదేవునకు। మీయాజ్ఞదలమోచిమెయికొన్నపనులు। సేయుదున
న్నింతచప్పగగలదె। మర్త్యలోకమునకు మరివేరెయొకడు। కర్తయున్నాడె
లోకత్రయవరద। యిందున్ననేమినాకందున్ననేమి। యెందున్ననేమినీయండ
నాయునికి। యనివిన్నవించినయానందికేశు। వినయోక్తులకుజగద్విభుడిట్లులని
యె। గురులింగమూర్తిచేకొనివచ్చియేన। పరమతవ్యర్థతత్పరుజేయువాడ।
ప్రాణలింగంబునై భ్రాజిల్లినీదు।ప్రాణాంగములనోడబడి యుండువాడ।రూఢి
గాజంగమరూపంబుదాల్చి। వేడుకనినుగూడివిహరించువాడ। తనుమనోధనము
లుదారువోకుండ। నను జేర్చికొనువాడ ననగిపెనంగి। నాప్రాణమునకుప్రా
ణంబగుచున్న। నాప్రమథులకుప్రాణంబగునీకు। నాకునుసందొకనాడులేకుని
కి। నీకతెల్లముగాదె లోకపావనుడ।యనియూరడిలబలుకునాశంకరునకు। తను
వెల్లచేతులై తామ్రొక్కినిలిచి। విన్నపంబేపనివినిపూదననుచు। నన్నందికేశుం
డుసాష్టాంగమెరగి। ప్రమథసన్నిహితుడై భ్రాజిల్లుశివుని। నమితతేజోమూర్తి
నాత్మలోనిలిపి। నరలోకమల్లదెనానంతనింత। నరుదెంచెరయమునంతనిక్కడ
ను। గురుతరంబైనశ్రీగిరిపశ్చిమమున। నరనుతంబగుచుగర్నాటదేశమున। క
డునొప్పునందుప్రఖ్యాతసద్భక్తి। సడిసన్నవాంగుళేశ్వరభాగవాటి। యనున
గ్రహారంబునందుప్రఖ్యాతి। మనుచుండుమండెంగమాదిరాజనగ। నతనిపరమ
సాధ్వియతివమాదాంబ। సతతశివాచారసంపన్నధన్య। కొత్తడినెల్లనుకొం

డొక పెద్ద। యుత్తమురాలుధర్మోపేతగాత్ర। యల్లవారలకంటె మొల్లంబునం
దు। నల్లలో యనజీవనంబునబొదిలి। కొడుకులులేమికికడు దుఃఖియగుచు। వెడ
నోములన్నియు వేసరనోమి। యామ్యలపొత్తంబులం దెల్ల వెదకి। హృద్యంబుగా
నందికేశ్వరునోము। కామ్యార్థసిద్ధికి కారణంబనుచు। సమ్యగ్వ్రతస్థితిసతికజెప్ప
టయు। నమ్మహాత్ములు జెప్పినట్లు గాగుడికి। యిమ్మలజనినందికేశ్వరుజూచి। స
ర్వాంగములుధరసంధిల్ల మ్రొక్కి। సర్వజ్ఞనందికేశ్వర దయాంబోధియంచుఁ బ్ర
స్తుతిజేసియతిభక్తితోడ- నంచితవ్రతచర్యలాచరించుచును। నిమ్మలసోమవా
రమ్మానిగాఁగ। తొమ్మిదిదినములుత్సుకలీలనోచి। మరునాడునందినిమజ్జనంబా
ర్చి। గురుతైనచందనకుసుమంబులిచ్చి। మెత్తనివస్త్రముల్ మెయినిండగప్పి।
యుత్తమాభరణములురుగట్టియలును। నందెలుగంటలునలవడగూర్చి। పొం
దుగాబసిడికొమ్ములుగొరిజెలును। బెట్టిఫాలంబునబట్టంబు వెలయ। గట్టినందికి
యలంకారంబుజేసి। యక్షతధూపదీపాదులొనర్చి। యక్షణంబునబంచభక్ష్య
ముల్ గుడిపి। పులగంబుముందటఁ బ్రోకగాఁబోసి। పులఖండమును నెయ్యిగలిపియ
పించి। పరమమాహేశ్వరప్రకరంబునెల్ల। బరిణమమందసపర్యలుజేసి। నం
దన్ననందీశనవనందినాథ। యిందుకళాధరుడెక్కెడుకుఱ్ఱ। నాయన్ననాతం
డ్రినాయాల రేడ। నీయట్టిసద్భక్తునీయట్టిపుత్త్ర। ఖ్యాతిగానొక్కనిగరుణించితే
ని। శ్రీతియలహసిబేరిడుదాన। ననుడునప్పుడుమాదమాంబకునంది। జనులెల్ల
నెరుఁగ। బ్రసాదంబువెట్ట । నక్కనమోమున నాప్రసాదంబు। మక్కవనె
క్కొల్పవాళినిదాల్చి। మ్రొక్కినిజావాసమునకునేతెంచె। నెక్కుడుశుభచే
ష్టలెదురుకొనంగ। నంతనెప్పటికంటెననురాగరసము। వింతవేడుకఫుట్టనెలది
యుబతియు। లీలవర్తింపమున్భాలోకమునకు। బాలేందుశేఖరు పసుపునజేసి।
వచ్చిననందికేశ్వరుడాత్మలోన। నచ్చెరువందితా నరుదెంచుపనికి। ననుగుణం
బుగదన్నుతనయునిగాఁగ। వనజాక్షినోము నేమనిజెప్పవచ్చు! తలచినకార్యంబు
తలకూడెననుచు। వెలదిగర్భమునఁబ్రవేశింపదడవ। మగువకంటునెలమసలితో
డ్తోన। తగగర్భచిహ్నముల్ తామంకురించె। నమృతాంశుడగుపుత్రుడతివగర్భ
మున। నమరియుండుటనొక్కొ యాకలిగాదు। జలజాక్షికడుపునసద్భక్తిరుచి

ము। డలరుటనోరుచులరుచులై తోఁచె। పాండురంగునిమూర్తిపడతిగర్భమున
నుండుటనో వెల్లనొందమైదీఁగె। పడతిశీలపుచూలు భవవిపాకములకు। నోడఁబడకు
నికినో యోకిళ్ళుపుట్టె। గ్రాలుచుసుతునిరాకకునోరుదెరచు। లీలనో సతికావులిం
తలుపుట్టె। శివమూర్తితనకుల్లోనవుటనోతవిలె। శివయోగనిద్రనో సొలువకుని
ద్ర। కాలకంధరుమూర్తికడుపుననునికి। నోలలితాంగిచన్మొనలునల్పెకెఱ।పె
నుపగుశివమూర్తిఁ వనితగర్భమున। చనరనోనడుముపేదఱిమివోనాడె। యో
గీంద్రహంసుడైయువిదగర్భమున। రాగిల్లుటనోనడవేగంబువెడలె। ననగమాని
నిగర్భమంతకంతకును।నునుపారితనుపారినునుపారిపొదలి। నవమాసములునిం
డ నందీశమూర్తిఁ। నవకమైకడుపులోననమవ్వమొంది। జననిగర్భావాసమను
గుహాంతరము। తనసమాధికిసుఖస్థానమైపరగ। సిద్ధపద్మాసనాసీనతదనర
శుద్ధాత్ముడైభూతశుద్ధికిజొచ్చి। కడవనూఁకుచునుదకముబారఁజల్లి। యడరనె
భృంగినో యగ్గిదానార్చె। బూదిచాదారాజడు పొగయుచుదాను। నూ
దండుముట్టించె నొకఱదీపంబు। నొప్పదీపంబుదానున్నయిల్లెల్ల। గప్పగా
లకయుండగాల్చిలోపలన। యిలగాలుమోపండునిట్టిబిడ్డండు। గలడన్మయను
చుశత్రులునుమిత్రులును। తమతమపట్లనుతారుండనోడి। భ్రమితులై కనుకని
పారుచునుండ। నచ్చుగాదాజౌదళాబ్జంబుగడిచి। వచ్చిత్రికూటంపువసుధపైని
లచి। సచ్చరిత్రసుషుప్తసపఱంబుజొచ్చి। గచ్చరషడ్దళకమలంబునొంది। కరమ
ర్ధిదశదళకమలంబుఁబొంది। పరగద్వాదశదశపద్మంబుఁజెంది।షోడశదళపద్మసురు
చిరసౌఖ్య। క్రీడావలోలుడై కేలినాడుచును। దాటియాద్విదళపద్మంబునదన్ను।
నాటించిసచ్చిదానందంబునూని। చనునిథోముఖములౌషట్కమలములు। మును
కొనియిట్లూర్ధ్వముఖములైతనర। సిశ్చలకోదండ నిజగతినున్న। పశ్చిమనాళసం
భవమైనయట్టి॥ నాదంబునకుఁజొక్కి నగముపైఁద్రొక్కి। మోదంబునకుఁజిక్కి
ముందటనిక్కి। సరినూర్ధ్వముఖ సహస్రదళాంబుజాత। మరయనథోముఖమై
మించివెలుగ। దివ్యుడైషోడశాంతవ్యోమచంద్ర। భవ్యసుధాపాన పారవశ్య
మున। నాతతంబుగపరంజ్యోతిస్వరూప। మైతనదగువెలుగై వెల్గుచుండ। పలువు
రాప్రతిమగర్భంబులోపలను। వెలిగెడుదీపంబువిధమునుబోలు।పాండురాగం

బైనపడతిగర్భమున। బోడిగా వెలుగుచుబుత్రుడిక్రియను। తగిలిశివధ్యాన తత్ప
రత్వమున। మొగడల్లికడుపులోమూడేడులున్న। సుతభరాక్రాంతయైమతిశ్ర
మంబంది। సతితోంటినందికేశ్వరుగుడికేగి। నోములుగీములు వేములగలిపి। నీమ
ర్యాసోచ్చితినిఖిలంబునెరుగ। మరుగునోచ్చినయట్లుమన్నించినన్ను। మెఱుగుంపు
సుతునీగిమేలయ్యె నేడు పున్నెంబుజేసినపాలతులునెలలు। నెన్నదొమ్మిదిమోచి
కున్నలగంద్రు। యల్లనమూడేడులయ్యెనన్నెంత। యెల్లడపెట్టెదోయన్న నేనె
రుగ। దుర్భరంబైనయీయర్భకువలని। గర్భంబుకకటిగర్భంబువోలె। నర
యంగనీయిచ్చువరముచాలోడవి। యరవుమాన్పింపవేచేమియునొల్ల। నన్నెం
తనెత్తికోనున్నదోకాని। యెన్నడువిందుమేయిట్టిగర్భములు। ననుచుదానచ్చో
టనచ్చోటసిలిచి। తనువుశ్రమంపడతనయింటికరిగి। వాన్పుపైనున్సని పరితాప
మంది। తన్పుగానార్ద్రచందనవారిదోగి। నివమునగనుమూసినిద్రబొందుడును
నువిదకుకలవోలెనతువల్లభుడు। జంగమలింగవేషంబొప్పదాల్చి। యంగనకిట్లని
యానతియిచ్చె। నీమనస్తాపంబునెవ్వగమాన్పు। గామించివచ్చితిగమలాయతా
క్షి। నీకడుపుననున్నయీకుమారుండు। లోకపావనమూర్తిగాకకేవలుడె। యా
దిబుషభముశిలాదునికొడుకు। నాదేవదేవునియానతిజేసి। భక్తిహితార్థమై
ప్రభవించునీకు। వ్యక్తిగాజెప్పితివగవకుమింక। పుట్టెడుపుత్రుడుపుట్టగదడవ।
పెట్టుమీబసవడన్పేరుపెంపార। ననియానతిచ్చిననంత మేల్కాంచి కనువిచ్చి
చూచుచోకానకెవ్వరిని। యీతడుమననందికేశుండుదాన। యేతెంచెగానోపు
నింతయునిజము। బతికితినాజన్మఫలమెల్ల నేడు। తుదముట్టెననుచుసంతోషాబ్ధిదే
లి। చెలులుజుట్టములునచ్చెరువందివినగ। గలతెరంగంతయుగడువేడ్క జెలిపి।
యున్నెడగోమలియుదరంబులోన। నున్నమహాత్మునిహృన్నలినంబు। దానయై
వెలిగెడుతత్పరంజ్యోతి। వానిప్రబోధించివచ్చినపనులు। నురచితేయనవుడునెరి
గిసద్భక్తి। యురయునెకుండగసాష్టాంగమెరగి। ప్రీతిబుత్రుడుమోడ్చు జేతుల
తోడ। నాతల్లిగర్భంబునందుదయించె। నర్ధోదయమునువందయుతనితోనున్న। యా
రేడుమూళ్లగుర్వాకృతిదాల్చి। యంగంబుపైగడుసాంగంబుగాగ। లింగసా
హిత్యంబులీలనొనర్చె। వచ్చినతోశివయవ్వరుగానకుండ। నచ్చోటనుండియో
యేతెంచెదపసి। యిదియేమకోటనిఇంటివారెల్ల। బదరుచుసంతవిభ్రాంతు
లైయుండ। మడచిననునుపుకెంజడముడినడుమ। మృడునిచందంబులువెడవెడదో
పకట్టినవెలిపాత్రికచ్చడంబెందు। బుట్టసిరుద్రాక్షభూషణంబులును। రాగకుండ
లములురత్నకంబళము। యోగదండంబునునొకచేతగోడుగు। బూదిబొక్కాస

ముసుబొలుపారు మేన। బూదిపైనొప్పుత్రిపుండ్రరేఖలును। తళతళయనునునుబ
ఁగపరుసయును। కలయనొత్తినవాలుగడ్డంబుదనర। తపసులరాజొక్కఁ తపసి
చందమున। నపుడుమాదాంబకునను రాగమెసఁగ। నిల్లకప్పుడెసంగమేశ్వరం బం
దు। నెల్లప్పుడునునిక్కఁ వెట్టులంజేని। యేనుకూడలిసంగమేశ్వరు పేరు। గావ
యాగుడిలోనఁగదలకుండుదుము। నాకొడుకొక్కఁజన్మమునఁగితండు। లోకహితా
ర్థమైనీకుదయించె। గానవచ్చితిజూడఁగానీభవమున। కేనసూగురుడసింకిటమీదటి
కిని। యానందమునకులింగార్పితంబు। లానసుమీయుంచుకంతైనఁగుడుప। ననుచు
నదృశ్యుఁడైయరిగెనతండు। మనసిజహరుఁడు తాననగనంతటను। బాలార్కకో
టులప్రభలుగీడ్పరచు। బాలునితేజంబుబర్వుటచేసి। సూచీముఖంబైన జొనుపం
గరాని। మేచినతిమిరంబునెల్లమానవుల। యజ్ఞానతిమిరంబునావంతలేక। విజ్ఞా
నమయుగనివేగంబపాయు। వేగకవేగినవిధమైనఁజూచి। రాగిల్లెనఖిలంబురవిపాం
కముడిగె। జననియుజనకుండుసత్పుత్త్రుఁజూచి। యనురాగరసవార్ధి మునిగియా
డుచును। భక్తులబిలువఁగఁబంచియిర్వురును। భక్తిప్రణామమొప్పఁగనాచరించి। యి
మ్ములసింహాసనమ్ములనిడితత్క్షణమ్మ। విభూతిపీఠ్యమ్ములఁపిడించి। పాదోదకంబులుబ
ట్టిమైఁగడిగి। బూదిఫాలంబునఁబూసిమైజల్లి। పంచమహావాద్యపటలంబులులియ।
నంచితాగణ్యపుణ్యాత్ముఁడత్స్పుతుని। బసవనామంబిడిబతియునుసతియు। నెసక
మెకఁగనున్నయెడగుమారుండు। వెసకజీకటియుండదనకేటితేజమనుగతిదీపం
బుగనుగొనినవ్వు। సన్నుతలింగప్రసాదమగ్నతనయున్నట్లు చనుజీకుచూరక
యుండు। శివసుఖామృతమునుచేగుమ్మలించి। చవియానుమాడిక్కహస్తములా
రగించు। శివపదధ్యాననిశ్చేష్టితావస్థదవులుచందంబునదావెరగందు। నిలిబిలి
సంసారమిలబారఁబోలి। చెలగియాడుగతిచేతులువిచ్చియాడు। మాయాప్రపం
చంబుడాయంగనీక। పాయదన్నెడుగతిబాదంబులాచు। వడిమైనితనపూనివ
చ్చినపనులు। తడవయ్యెననుచునుతెకడుభంగినులుకు। భవుచాడనానంద బా
ష్పంబులొలుకు। పవిదినేడుచుగన్నుగవనశ్రులొలుక। భవభాధలకునగపడిమొ
రవెట్టె। భవులకుయ్యాలించుభాతినాళించు। నొడయలమ్రొడుగులబడమొదల్వె
ట్టు। వడువునబుడమిపైబడిబోరగిల్లు। నిలమనుపడ్డనిర్మలశివభక్తితలమెత్తు వడు
వునదాచలమెత్తు। నరుదొందపద్మాసనాసీనవృత్తి। బొరినభ్యసించు పొల్పున
గూరుచుండు। పూనిద్వితీయశశంఘుండనునంది। నేనయన్భావననిలదొంగియాడు
నావీరమాహేశ్వరాచారమెల్ల। బ్రోవయినిలచినపోల్కినల్చుండు। కడకతోనా
దిమార్గముదప్పకూడ। నడుగిడులీలదప్పడుగులువెట్టి। మలహరుబేర్కొనుమా

త్రగద్గదము। లలరుకైవడిదొక్కుపలుకులువలుకు। బల్లిదుల్నాశివభక్తులే యను
చు। గ్రొళ్ళువారుచునాడుక్రియచారియాడు। నంతవినోదంపుటాటప్రాయము
న। సంతతంబునుశివార్చనమాచరించు। బుద్ధియెఱుంగలేబురులుప్రాయమున।
శిద్ధంబుభక్తులశివునిగాదలచు। సర్వజ్ఞుడైనవృషభమూర్తిగాన। సర్వవిద్యలుస
హజంబవాటిల్లె। గతభక్తియుక్తుడైగర్భాష్టకమున। సుతునుపనయనంబుశు
భలగ్నమునను। సేయుదుననితద్దచిడిముడిపడగ। నాయెడబసవడిట్లనియె దండ్రి
కిని।వడుగనిఁబదియేమిగడియించెదీవు। జడుడవెట్లయిలిపీశ్వరుని గొల్చియును।
పరమాత్మునిగురునిగాబడిసీదుర్నరుల। గురులనికొలిచిననరకంబుగాదె।గతపూ
ర్వజన్మసంసారుడైతలప। వితతద్విజత్వంబుపతితంబుగాదె। నిర్మల గురుకృ
పాన్వితజన్మునకు। కర్మజన్మంబుదుష్కర్మంబుగాదె। యగ్గురుపాదంబులర్చిం
చునతని। కగ్గిలోహవి వేల్చుటదితప్పుగాదె। మలహరాత్మకమగుమంత్రంబుదల
చి। పలుమంత్రముసులుగొనపాపంబుగాదె। శూలిభక్తులకెత్తుకేలదిత్రాట। మా
లలకెత్తుటమాలమిగాదె। కర్మపాశంబులొక్కటదెగనీల్గి। కర్మంపుత్రాళ్ళుచా
గట్టుకోదగునె। రుద్రాక్షభసితాదిముద్రలుదాల్చి। క్షుద్రముద్రలుదాల్పగూడు
నేచపుమ। నీరికిత్రాటికిదూరమైయున్నవీర మాహేశ్వరాచారదీక్షితుని। నిర్మి
తోభయకర్మనిర్మూలునన్ను। గర్భాబ్ధిముంచంగధర్మమేనీకు। గ్రచ్చరకన్నులగా
నవుగాక। వచ్చునేబసవనివడుగుసేయంగ। బ్రహ్మశిరోహరప్రమథైకవంశ్యు।
బ్రహ్మవంశ్యుండనిభావించెదెట్లు। జాతిగోత్రాతీతసద్గురుజాతు। జాతిగోత్ర
క్రియాశ్రయుజేసెదెట్లు। లకులస్థుడైయున్నయభవునిభక్తు। నికినొక్కకులమనిని
ర్ణయించెదవు। కావుననెన్నిమార్గములనువడుగుగావింపగారాదు। కథలేమి
చెప్పననవుడుదండ్రియిట్లనియె బుత్త్రునికి।వినవయ్యబసవయ్యవిప్రమార్గంబు।
నాగమవిధిబదియారుకర్మంబు। లాగర్భసంస్కారమాదిగాగలవు। వానిలోనొ
కడైననూనమైనేని। కానేరడాతడగ్రకులోత్తముండు। నందువిరుద్ధమెయ్యది
ముద్రగణము। నందిముఖంబుపనయనపూజకును।పనుగొనప్రణవంబు భగుణ
డేదైవ। మనుటయుమంత్రంబునట్లునుగాక। పెట్టినసూత్రముల్భీమసర్పములు
పట్టినపాత్రంబుబ్రహ్మశిరంబు! పాలాశదండంబుపంకజోదరుని। కోలెమ్ముత
లచుట్టుకొనకటుల్జడలు। నఅతికృష్ణాజినమదిగజాజినము। వఅలుమేధావియే నే
ఱభూతిగాగ। హనుడుభిక్షాటనమాచరించంగ। నరిగినవేషమింపార దాల్చిన
ను। నక్షైనగానిబ్రాహ్మణుడుగాడనిన। నిట్టివిరుద్ధమేయీశుభక్తునకు। వడుగు

చేసినభక్తిపట్టిపాటగునె। వోడువరితనమునగడువనాడెదవు। పసిబిడ్డ మాట
లపనియు లేదింక। మసలకసేయుమామా చెప్పినంత। యిట్టిచోద్యంబులేమెరుగ
మేనాట। పట్టిమాకడుపునబుట్టితి గాక। ప్రాలుగల్గుసుపుత్రుబడసితిమింక। మేల
య్యేనని మేములీలను న్నెడను। పుట్టినాడకులముపురులువోనాడ। నెట్టయ్యతలచె
డుపట్టిమాయయ్య। కులదీపకుడుపుట్టకులముపర్థిల్లు। గులనాపకుడుపుట్ట గు
లమెల్లద్రుంగు। గులమున కెల్లను గుద్దలిగొంటి। వెలిసేయరేనిన్నుపిత్రులుపిన్న। ని
న్నుచేపట్టియునీతిమైకులము। చెన్నటిబోనాడిచెడ నెట్లువచ్చు। యుక్తి చెప్పితి
మిప్పుడొల్లవైతేని। భక్తియునీవునుబడ్డట్లుబడుము। యనినిష్ఠురోక్తులనందందబ
లుక। వినిపొంగిబసవడిట్లనియెగోపమున। బ్రాహ్మ్యంబుభక్తియుబలికెదుకూ
డ। బ్రాహ్మ్యంబు వేరెదర్శనమునైయుండు। వేరెదైవంబును వేరెమంత్రంబు।
వేరెయాచార్యుండు వేరెవేషంబు। ధ్యానంబు వేరబ్రాహ్మ్యక్రియల్ వేర। మాను
గానాచారమార్గంబు వేర। కాజేసియగ్నిముఖముబ్రహ్మశిరము। నాదిరుద్రుడు
శిఖహరిహృదయంబు। ప్రాణాదివాయువుల్ ప్రాణంబుయోని। క్షోణిదాశ్వే
తంబుసూవెవర్ణంబు। నసమాత్మువిధమెగాయత్రిసాంఖ్యాయ। నసగోత్రమిరు
వదినాల్గక్షరములు। దానికిమరిత్రిపాదంబుషట్కుక్షి। పానలొండును గావు
పంచశీర్షంబు। ననిచెప్పగాదెమీయాజ్ఞకంబులును। వినుముదైవంబదివేరానా
కాదొ। కావుననిదియుసాంఖ్యాయనమతము। దైవమన్నదిలేదు దాబహురూ
పు। దానికాచార్యుండుధరగర్మజడుడు। దానికిమంత్రంబు దాను గాయత్రి। ప్ర
తిదినక్రియకర్మబంధంబువేష। మితరేతరము మోక్షహేతువేతలప। నదిగాకష
డ్దర్శనాతీతమైన। మదనారిసద్భక్తిమార్గంబువినుము। శ్రుతివిశ్వతశ్చక్షుబుత
యంచుబొగడు। స్తుతులమీరినయతిసూక్ష్మరూపంబు। నాదికినాదినిత్యానందకీ
ర్తి। శ్రీదివ్యలింగమూర్తియెదైవవిభుడు। నట్టియీశ్వరునాత్మబుట్టించిచేత।
బెట్టంగ జాలినపృథుదయామూర్తి। ప్రకటింపనగురోరధికమనబరగు। సకల
స్వరూపిమాసమయసద్గురుడు। మంత్రంబులకురాజమంత్రమైవెలయు। మం
త్రంబుదీనికిమరిషడక్షరము। భవదూరమగుజటాభసితరుద్రాక్ష। సవిశేషమో
క్షానుసారివేషంబు। భువిజన్మపాపౌఘభూజకుఠార। మవిరళసత్క్రియాష్టాం
గసద్భక్తి। సందర్శనంబునసకలపాపములు। డిందుమోక్షాంగనపొందుగావు
నను। నిదిఫలప్రాప్తియింకిటమీదలింగ। పదసేవనోత్కృష్టభవ్యసౌఖ్యంబు। ఫ
లమిట్టిదనిచెప్పభావింపశ్రుతుల। దఱమెజీవన్ముక్తితత్వాత్మకంబు। కావునవే
రెమార్గంబుగాజూడు। భావింపబ్రాహ్మ్యంబుభవునిభక్తియును। కలవంప్రమద

శఁనంబులు నాఁగఁ గొన్ని। కలసియుండు నెమ్మనొక్కం డొకండందు। దర్శనంబులు
గల్గఁదలచిరేని యును। దర్శనంబది పేరెతత్త్వరూపంబు। తలపనీశ్వరపదతల్లీయ
సౌఖ్య। ఫలకారణము కర్మపాశబంధంబు। నిటు గాక యుభయము నేక మండ్రేని।
యటువోదు మానిటలాక్షుభక్తునకు। ధరనన్య దేవతాస్మరణమాత్రమున। నిరువ
డెనిమిది గోట్ల నరకంబులొందు। నన శ్రుతులందునవిన రెచాపనికి। దినకర పావక
దిక్పాలకులను। హరివిరించ్యాదులసఖిల దేవతల। ధరమూఁడుసంధ్యల తాఁగొల్వ
వలయు। గొలువక తక్కిన బొలిసె బ్రాహ్మ్యంబు। కొలిచెనేని యుభక్తి పొలిసె
గావునను। బ్రాహ్మణుఁ డేనియు భక్తుఁ డెట్లగును। బ్రాహ్మణుఁ డెట్లగు భక్తుఁ డేని
యును। మామిడి విత్తు దామహిమీద విత్త। వేమగునే పెక్కు విధులేల చెప్ప। సహ
జైకలింగనిష్ఠాయుక్తిభక్తి। బహుదేవతాసేవ బ్రాహ్మణపధము। కులసతియ
ట్లనిశ్చలభక్తియుక్తి। వెలయాలియట్లనవ్విప్రమార్గంబు। కాదేని నందిముఖ్య
స్థితిఁ గొలిచి। యాదిదేవుఁడె దేవుఁడనుమంత్రి మెరిగి। తారుద్రవేషంబు తాల్చె నేని
యును। వారకయట్ల దావతిరింపవలదె। యిలువేలు పైన సర్వేశ్వరుండుండ। ప
లు వేలుపుల గొల్వ బాడియే చెపుమ। కానయున్నియు జెప్పఁగా బనిలేదు। దానిసం
డియు మె గౌతమునిదధీచి। వ్యాసునిశాపంపుటగ్గి పాలైన। భూసురులకు భక్తిపొ
లుపొందనగునె। యురువడి చేసి భక్త్యుద్రేకమునను। పరమార్థ మెడలంగ బలికె
నావలదు। నిది శ్రుతిస్మృతిమూలమే గానియొండు। పదకవాదములని భావింపజన
దు। కర్మమార్గంబగు గాక బ్రాహ్మ్యంబు। నిర్మలశివభక్తి నిష్ఠితంబగునె। యశి
బ్రాహ్మణమార్గమదితథ్యగాగ। బట్టియాడెద వేని పనియె లేదింక। కాకులు వెంచి
నకోకిలపిల్ల। కాకులబోలె నే కావుకావనుచు। నెక్కడ తల్లిమీ రెక్కడి తండ్రి। యి
క్కడి తోడు ధర్మేతరులార। చెన్నయ్య మాతండ్రి బేరమ తల్లి। పిన్నయ్య కక్కయ్య
బిడ్డండ నేను। వేడుక సద్భక్తివిధినుండువాఁడ। నేడు గడయుమా కునిదినికక్కవం
బు। మీయంతనుండుడు మీరును నేను। నాయంతనుండెద వేయును నేల। యనిస
హోదరియగునన్నాగమాంబ। యును వానునచ్చోటనుండగాదనుచు। నరు
డెం చెమరి ఫణిహారి యింటికిని। నరులిది చోద్యమనంగ నంతటను। వదుగునకనిము
న్నువచ్చినయతఁడు। పడతిమాదాంబకు భ్రాత సజ్జనుడు। పాండురాంగుని భక్తి
పరుఁడు బిజ్జలుని। బండారిబలదేవదండనాయకుఁడు। శివభక్తునకు పెండ్లి సేయు
దు గాని। భవికి నీననుతొంటి బాసదలంచి। యిట్టి భక్తునకిప్పుడీక నాకూఁతు। నెట్టివా
నికి నిత్తునింక నేననుచు। బసవకుమారుని పాలికిబోయి। యెసక మెసగ గూఁతునిచ్చి
తా మొక్కి। నాబిడ్డ చేకొనినన్ను రక్షింప। వే బసవన్న మాహేశ్వర తిలక। యను

ము వార్ధన చేసియాబసవయ్య। యనుమతంబునబురమభిరమ్యముగను। మకరతో
రణములుమణితోరణములు। ముకురతోరణములుమునుగట్టచేసి। కలయగవీధుల
గస్తూరియలుకు। డెలమిముక్తాఫలంబులమ్రుగ్గులిడుడు। రండుభక్తులబిలువుండు
మీరెదురు।వోండువేగమతోడితెండుతెండనుచు। నిటవచ్చునయ్యలకెదురువచ్చు
చును।నటవచ్చునయ్యలకర్ధిమ్రొక్కుచును। సింహాసనస్థులజేసియాకర్మ। సంహా
రమూర్తులచరణముల్గడిగి। యవిరళనవ్యపుష్పాంజలులిచ్చి। ప్రవిమలధూపదీ
పంబులొనర్చి। యమ్మహాత్ములకుసాష్టాంగుడైయతం। డమ్మవిభూతివీడ్యమ్ముల
ర్పించి। కోలాటమునుపాత్ర గొండ్లి పేరిణియు। కేళికజోకలై లీలనటింప।బా
యకబాగుబళాయనుశబ్ద। మాయతినాకసంబంధిఘూర్ణిల్ల। నలిరేగివేణువీణా
వాద్యవితతు। లులియుపులీలతోనొక్కొటమ్రోయ। నానందగీతంబు లగ్గించు
వారు। పూనిశంకరగీతములుపాడువారు। జతిగీతములమీదజప్పటవిడుచు। నతిశ
యశివభక్తినాడెడువారు। నాదిపురాతనాపాదితస్తుతులు। వేదార్థములుగా
కవినుతించువారు। నెరిశివమరులనగురిలేనివేడ్క। నరిమురిమిన్నంది యాడెడు
వారు। మ్రొక్కిశివానందమునదన్నుమరిచి। నిక్కపుసుఖముననిద్రించువారు। ని
ఖిలమాహేశ్వరనికరంబునిట్లు। సుఖగోష్ఠికొలువున్నచోబసవయ్య। యప్పా
టజలములనభిషిక్తుడగుచు। నొప్పుదివ్యాంబరయుగ్మంబుసాతి। భసితంపు నెరి
పూతపలుచగాబూసి। నొసలత్రిపుండ్రముప్పెసగధరించి। మౌళిప్రసాద సు
మంబులుదురిమి।పోలగరుద్రాక్షభూషలుదాల్చి। సారమైలింగపసాయితం బనె
డు। పేరునగల్గుకతారంబుగట్టి। యానందబాష్పంబు లలుగులువార। మేనురో
మాంచసమ్మిళితమైతనర। బగుతులపాదుకాప్రతతులునాకు। నగపడెననుచు
నందందమ్రొక్కుచును। నొడయలకడుగులుపొడచూపనోడ। మడచి వెనకకు
డాచిమహినప్పళించి। యూరులుమోచేతనూదికేల్మోగిచి। వారకమ్రొక్కంత
వంగియుప్పొంగి। తనతోంటిభావంబుదాల్చినయట్టి। యనిమిషుడైకన్నులారజూ
చుచును। భక్తిశృంగారమేర్పడజూరగొనిన। భక్తికళార్ణవుబసవయ్యజూచి।
యిట్టిధన్యుడనౌదునేనిప్పుడనుచు। దట్టుడుబలదేవదండనాయకుడు। తనకూ
తుగామినీజనతిలకంబు। ననుపమశృంగారవనధిగంగాంబ। దోడ్తోనతెచ్చిభక్తు
లకుమ్రొక్కించి। యేక్షేత్రశుభచేష్టలెదురుకొనంగ। శివభక్తవనితలుసేనలుచ
ల్ల। శివబలంబగ్గలించినముహూర్తమున। వేదోక్తశివధర్మవిధిబసవనికి। గాదిలి
సుతబెండ్లిగావించెనంత। యట్టిదకాదెమున్నాదిదలంప। నిట్టటనావలదడియె
పథంబు। హరునిభక్తులబలంబదిలేమిగలిమి। హరివిరించులుద్రుంగుదురుమంద్రు

ననిన। తక్కిన గ్రహచంద్రతారాబలముల। నెక్కువ తక్కువలెన్న నేమిటికిఁ గ
రుణజూచుట మెలగ్నంబు సేయుటయు। వరముహూర్తంబుదీవన మెబలంబు।
గానభక్తులకృపగలబసవనికి। నేనాటవిందు మేయిట్టి పెండ్లిండ్లు। ననుచులోకం
బెల్ల నాశ్చర్యమంది। వినుతింపుచుండిరివీరువారనక। యంతభక్తాళికనభిమతార్థ
ములు। సంతుష్టి గాబరిచర్యయొనర్చి। సాష్టాంగుఁడై భువిజాగిలి మ్రొక్కి। శిష్టభ
క్తాలికిచేతులు మొగిచి। యిల్లకప్పడెసంగమేశ్వరంబందు। తెల్లంబుమాగురు దే
వుడున్నాఁడు। చనియెదవారిశ్రీచరణముల్ గొలిచి। కనియెదమిక్కిలికరుణమీ చే
త। ననుచుసోదరియును నాలును దాను। సనియెనాబల దేవుడనుపవేగంబ। యప్పు
రిబసవడల్లంతటగాంచి। తప్పకగురుపదధ్యానాత్ముఁడగుచు। గురువున్న పురి
దృష్టిగోచరంబైన। ధరజాగిమ్రొక్కుచునరిగెనంతంత। కన్నంతనుండిదాజన్నం
తదవ్వు। నెన్నయోజనమాత్రమెసగమ్రొక్కుచును। నెదురుగ దామున్న గురు
భక్తిశివున। కిదియంతపెద్దతానితనివీక్షింప। ననియుల్లవారలునర్థిగీర్తింప। చని
చొచ్చెపురిగురుస్తవముతోగూడ। నప్పురిమహిమ తానదియెట్టులనిన। జెప్పగన
లవియెశేషునకైన। పురియేరులన్నియుబుణ్యతీర్థములు। పరగగగుహలెల్లహరు
నివాసములు। గిరులన్నియును హేమగిరులుతలంప। తరువులురుద్రాక్ష తరువు
లుగలయ। వనములన్నియుబుష్పవాటికలచటి। గనులన్నియునుభూతిగనులుభో
ల్పార। కొలకులన్నియునొప్పజలజాకరములు। కలగోవులన్నియుగామధేనువు
లు। కోడెలన్నియునందికుర్రలాపురము। వాడలన్నియురంగవల్లివేదికలు। నరు
లెల్లభక్తులుచిరజీవులెల్ల। పరికింపగారణపురుషరూపములు। స్త్రీలెల్లబరమపతి
వ్రతాచరలు। నేనెల్లనవిముక్తసిథిసమానంబు। పలుకులెల్లనుదత్వభాషలుజను
ల। యులువెల్లగీతవాద్యోత్సవంబులును। కల్లరిపతితుండుఖలుడుదుర్జనుడు। ప్ర
ల్లదుడరజాతిభక్తిహీనుండు। వికలుండుగొండీడువెదకిననైన। నొకడుమందు
నకైననూరిలోలేడు। ననమానలీలనిట్లనిబ్రస్తుతింప। నెసగుకప్పడిసంగమేశ్వరం
బందు। నడిసన్నకూడలిసంగమేశ్వరుని। గుడికేగితన్నుభక్తులెదురుకొన। గుడి
ముందటనునిల్చిగురులింగమూర్తి। యడుగులకపుడుసాష్టాంగుడైమ్రొక్కి। వే
దపురాణార్థవిమలసూక్తులను। నాదంబుపూరించి నలిబ్రస్తుతింప। తొల్లింటివే
షంబుతోవచ్చితేట। తెల్లగాసంగయదేవదేవుండు। గుడివెలిఁబొడసూప గురు
లింగమూర్తి। బొడగనిబిట్టులిఁపడిబసవండు। పెద్దయాప్రమదంబు బ్రీతియు
భక్తి। దుద్దకిఁతనలోనదొట్రికొనంగ। నంతంతమరియుసాష్టాంగుడై మ్రొ
క్కి। వింతవేడుకవెల్లివిరియగగురువు। చరణములానందజలములగడిగి। గురు

పూజతన్న కాకూడనపిలించి। పడియున్న నతిదయాభావామృతంబు। కడకంట
గడగూడ గాడు సలేసత్తి। యందందఁ గౌగిటనప్పళించంగ। ముందటమొగికుఱుచు
మోడ్పు గేలమర। నెలకొన్న తత్స్వర నేత్రాంగవిక్రి। యాలుభూషణంబులైయా
దటనున్న। బసవకుమారు సద్భక్తికి మెచ్చి। వెసఁ బ్రసాదం బప్పుడొసగియిట్లనియె।
వచ్చినవాఁడియనవారి చేనీదు। విసచ్చరిత్రముని సంతసిల్లుదుము। గతకాలవర్త
నకం బెసద్భక్తి। మితిదప్పి నడవకుమీ బసవన్న నడిసన్న। భసితాదిశాసనధరుల
మృదుదుగా మదినమ్ము మీ బసవన్న। శూలిభక్తులను దుశ్శీలముల్ గన్న। మేలుగా
గైకొనుమీ బసవన్న। శత్రులైననులింగసహితులైయున్న। మిత్రులఁ గాఁజూడుమీ
బసవన్న। పట్టిన వ్రతములు ప్రాణంబుమీఁద। మెట్టిన విడువకుమీ బసవన్న। వేరైభ
క్తులజాతి వెదకకుండుటయె। మీరినపథమునుమీ బసవన్న। చిత్తజాంతకుభక్తిచే
డనాడుఖులల। మిత్తివీ వైత్రుంపుమీ బసవన్న। వేదశాస్త్రార్థ సంపాదితభక్తి। మే
దిని వెలయింపుమీ బసవన్న। తిట్టిన భక్తులు కొట్టిన గాల। మెట్టిన శరణను మీ బసవ
న్న। యెదప్పవట్టుదు నిలబర స్త్రీల। మీఁదగన్నార్పకుమీ బసవన్న। సాధ్యమాభ
క్తప్రణదేతరంబ। మేధ్యంబు గాజూడుమీ బసవన్న। నిక్కంబు భక్తి నిర్వంచకత
యె। మిక్కిలిగుణమునుమీ బసవన్న। యేప్రొద్దు జంగమం బేన కాఁజూడు। మీప్రసా
దమె కొనుమీ బసవన్న। నాలుక కెంపుగా శూలిభక్తులను। మేలుగా నుతియింపుమీ
బసవన్న। యేమైన వలసిన యెడలను దలపు। మీ మమ్ము మరువకుమీ బసవన్న। మో
సబుచ్ఛశివుండు దాసయేనురకు। మీసత్యమెడపకుమీ బసవన్న। యనిమ్మదు మధు
రాంచితాలాపములను। తనయుం బ్రబోధించి తాగౌగలించి కొడుకు చేర్మొక్కించి
చికొనిమహోత్సుండు। గుడిజొచ్చి తొంటికై వడినున్న యెడను। యందరునతివిస్మ
యాకాంతులగుచు। నిందుమాళి యెకాక యితడు మర్త్యుండె। యెన్నడీ గుడికి
డనీతపోరాజు। గన్నవారెవ్వరుగలరయ్య తొల్లి। బసవడు తనకెంత భక్తుడో గా
క। యెసకంబుతో సంగమేశుండు తాన। వచ్చి తాపసక్రియ మెచ్చి బోధించి। చా
చ్చెనగ్గుడియె తానెచ్చనో యనగ। నతిశృతకృత్యులమగుదుమేయిట్లు। స్తుతియిం
పగనుగొనజొప్పడె నేడు। బాపురామాయన్న బసవకుమార। బాపురామా
తం ద్రిభక్తివర్ధనుడ। నల్లవో బసవన్న నవనందీశమూర్తి। నల్లవో బసవయ్య
ముల్లోకవంద్య। యిట్టుండ వలవదా పుట్టిన ఫలము। యెట్టు నను స్నార మేమేమి
గారయ। తనయునొప్పించి వస్త్రాదు సమర్పించి। వనితనియోగించి జనకునిర్వం
చి। పడసిగాద్యుంటొల్లి బసవడిట్లీపుడు। బడయు నే శివుకృప బట్టకబయల। నని
యెల్లవారలు వినుతింపుచుండ। ననురాగచిత్తుఁడై యా బసవయ్య। కూడలి సంగ

లింగయ్యగుడిమంటపమున। గూడిభక్తావళిగొలువిచ్చియుండ। సారాంచితో క్తులసంస్తుతింపుచును। పూరితంబుగనాదపూజసేయుచును। మూడు సంధ్యల గురుమూర్తిఁగొల్చుచును। పోడిగాత్రొద్దులుబుచ్చుచునుండె। బసవ పురాణార్థపరిదయాన్వీత। బసవపురాణార్థపరిమళాఘ్రాత। బసవనామావళి పరమానురక్త।బసవనామావళిపారకాసక్త। బసవపాదాంభోజపరిమళభృంగ। బసవపాదాంభోజభరితోత్తమాంగ। బసవకారుణ్యసౌభాగ్యైకపాత్ర। బసవకారుణ్యసంపత్కళామాత్ర। బసవసన్నిహితసద్భావాత్మసఖ్య। బసవసన్నిహితసద్భావసంగాఖ్య॥

గద్య॥ ఇతియసంఖ్యాతమాహేశ్వరదివ్య। పదపద్మసౌరభభ్రమరా
యమాణజంగములింగ ప్రసాదోపభోగ। సంగతసుఖసుధా
శరధినిమగ్న। సుకృతాత్మపాలకురికిసోమనాథ। సు
కవిప్రణీతమైశోభిల్లితనరి। చరలింగఘనకరస్థ
ఆవిశ్వనాథ। వరకృపాంచిత కవిత్వ
స్ఫూర్తిఁబేర్చిఁ। చనుబసవపు
రాణమనుకథయందు
ననుపమంబుగ॥

బ్రి థ మా శ్వా స ము య్యె.

సం పూ ర్ణ ము.

శ్రీలక్ష్మీగణపతయేనమః

## శ్రీబసవపురాణము.

## ద్వితీయాశ్వాసము.

శ్రీలింగమథనవిలోలకేళీవి। శాలసౌఖ్యానందసంగయామాత్య। యక్కడ
నంతకళ్యాణంబునందు। నెక్కుడుశివభక్తికెల్లనైపరగు। బండారిబలదేవదం
డనాయకుడు। దండిబసవనికితనయనిచ్చుటయు। ప్రమథు లెంతయు మెచ్చిరా
బంపబోవు। క్రమమునప్రమథలోకమునకేగుడును। బలదేవమంత్రి యాప్తులబం
ధుజనుల। బిలువగబంచియాబిజ్జలుండనియె। హితుడుతోబుట్టువుసుతుడెవ్వడై
నా। నితనినియోగంబుప్రతిదాల్పగలడె। యనవుడుకలడుమహారాజుయితని। తన
య। ప్రాణేశుండువినయోక్తిపరుడు। నీరాజ్యమంతయునిలుపగగలడు। దూరీకృ
తాఘుండుదోర్బలాధికుడు। వినుడఖిలకళాప్రవీణుడెట్లనిన। జనులెల్లనెరుగగసం
గమేశ్వరుని। చే బ్రసన్నతవడసెనుగాననీకు। బ్రోబ్రధానిగదగుధరణీశయనిన। ని
జ్జగంబంతయునేలినకంటె। బిజ్జలుడెంతయుబ్రీతాత్ముడగుచు। దనపీటదగినప్ర
ధానులహితుల। దనమెక్కుడుభద్రేభమునునమాత్యులను। బసవనిదోడ్తేరబంచు
డువారు। నెసకంబుతోసంగమేశ్వరంబేగి యక్కడబసవనినసమానుగాంచి।
చక్కజాగిలబడి। మొక్కియిట్లనిరి। నాకోపభోగాపునర్భవాదులను। నీకొకలె
క్కయెనిజమట్లుంగాక। శివభక్తిసారానుభవభవ్యసుఖికి యవసంబెకాకరు
చ్యములేయన్నియును-నైననులోకహితార్థుండవీవు। గానమాప్రార్థనగై
కొనవలయు। బిజ్జలక్షోణీశు। ప్రియమునిల్పినను। నిజ్జగతీతలంబేలడెచెపుమ। మం
త్రిపట్టమునరూమండలంబునకు। దంతరింబునకునిజాప్తతకును మూల। బండారమున
కుభూపతిరాజ్యమునకు। నొండెమినీవకాకున్నవారెవ్వ। రతడుపట్టైడుకూటి
కహంకారుండుగాని। క్షితికెల్లనీవనూపతివనికరంబు। విచ్చేయుమనియిట్లువిన్నవిం
చుటయు। నచ్చోటభక్తిహితార్థంబుదలచి। నందరుగొలిచిరానట్లకాకనుచు।
కందర్పహరభక్తగణములనెల్ల। గొలిచితత్కారుణ్యజలరాశిదేలి। యలరుచుజ
న్నుదేరనంతనిక్కడను। నదెవచ్చెనిదెవచ్చెననవినిముదిత। హృదయుడై బిజ్జలుడె

ఘోరుకొన్నేడు నలవడబడియు రెండామడ నేల। కలయగ గళ్యాణకటక మతం
యును। శ్రీరమ్యముగ నలంకరింపబంచి। భూరమణుండు శృంగారంబు చేసి।
మండలాధీశ సామంత ప్రధాన। దండాధినాథ మాతంగ తురంగ। పరివార సహి
తుడై పరమహర్షమున। నరుదేర పదహతి ధరణి గ్రక్కదల। వివిధ వాద్యధ్వనుల్
దివిదీటికొనగ, నవనీత లేశుడల్లంతట గాంచె। బసవకుమారు సద్భక్తి శృంగారు।
ననదృశాకారు తత్త్వార్థ విచారు। నేకాంగవీరు దేహేంద్రియదూరు లోకవి
స్తారు నలోకానుసారు। జంగమవ్యాపారు సజ్జనాధారు। లింగ గంభీరు గతాంగ
వికారు। విమల శివాచారు త్రిమలధిక్కారు। నమితమహోదారు నచలితధీరు।
విరహితసంసారు వీరావతారు। పరిహృతాహంకారు భక్తి విచారు। శివభక్తి
సారు విశిష్ట ప్రకారు। నవినాశ సంస్కారు నతులితశూరు। విపులక్షమాగారు వి
నయప్రచారు। సుపక్షైకవిస్తారు శుద్ధశరీరు। సుజనవిదారు సద్గుణమణిహారు। వృ
జినతరుకుఠారు విహితోపకారు। నతదయాలంకారు సఘనమత్సారు। హితహృ
ద్గతోంకారు నతసముత్కారు। శ్రుతిపరిచారు సిరోన్మహాంధకారు। కృతరిపుసం
హారు ధృతనయాచారు। గని పాదచారియై చనుదెంచి చేరి। ఘనతర ప్రియపూర్వ
కంబుగ నప్పుడు। సముచిత సత్కారసంతుష్టు జేసి। సమదాంధగంధగజంబులే
న్నూరు। పండ్రెండు వేల సుంభత్తురంగములు। పండ్రెండు లక్షల బల పత్పదా
తి। పాటిబండారులు పన్నిద్దరందు। మేటితనంబున నర్మిలియిచ్చి తనదు। సఖిలరా
జ్యము సుపర్ణ గా జేసి। సుఖలీల గజ్జలజ్యోతిశ్వరుండు। తానును బసవన దండ
నాయకుడు। గా నియోగము గొల్వ నరుదెంచు తరిని॥

పుణ్యాపుణ్యాంగనల్ పురవీథులందు। పుణ్యాత్ము బసవ ప్రభుని జూచువే
డ్క। జూడగ వచ్చె దసుదతి నేననుచు। వేడుక చరపక వేగరవమ్మనుచు। గాలి దో
సగు గాక క్రమ్మరుమనుచు। నేలమ్మ వచ్చిన నేమి నీకనుచు। నేకతంబౌక తెరు వే
గుమీవనుచు। నీకాళ్ళ నడచెద నేకాంత యనుచు। బతిగన్న నైచు నేవడతి నిన్ననను
చు। బతిగని యుల్లై నబదరనిమ్మనుచు। బసవన్న జూడక పడతి పోననుచు। ముసు
గిడి వేగరామురియక యనుచు। తోకొనిపోయిన దోసమేయనచు। మూకలోనికి
బోకు ముగ్ధ నీవనుచు। దిక్కులు చూడక చక్కరమ్మనుచు। నక్కడి తరువమ్మ
యింతి నీకనుచు। మానిని బసవన్న మహిమీదననుచు। మాను గా భక్తుల మరి చూ
డుమనుచు- నిట్టి సందడి గల దేమెందు ననుచు। కట్టాడకిటు వేగ తరుణి రమ్మనుచు
కంటివే బసవయ్యాగమలాయతాక్షి। కంటిని మోక్షంబు గంటి గాకనుచు। జూచితి
వే దమా సుకుమారి యనుచు। జూచు చుండక పోవ సాగయునే యనుచు। వచ్చ

వారునుజూచువారునుగట్ట। నిచ్చువారున జూచిరమే గెడువారు। బోరి బోరి జె
చ్చి విభూతివీడ్యంబు। ఆరుదంద బసవయ్యకర్పించువారు। నంగనల్వివిధ పుష్పాం
జలులిచ్చి। మంగళారతులెత్తి మహి మ్రొకుఱ్ఱవారు। స్వస్తి దీర్ఘాయువు శంక
రంబనుచు। ప్రస్తుతిదీవెనల్ బచరించువారు। హృద్యంబుగాగీతగద్య పద్యముల।
చోద్యతరంబుగాస్తుతియించువారు। వారివారికినిక్కైవారముల్ సేయ। వారును
నలిరేగి తారాడువారు। కలకలంబునకడగ్గరక।హర్మ్యాగ్రశిఖతలములపై నుండి
తర్కించు వారు। సందోక యడవి ముగ్ధాంగనయచటి। సుందరులకు సన్న
జూపి యిట్లనియె॥

పంచినపివిధవాద్యంబులు దమ్మ। తంబులునిస్సాణంబులు చెలగ। నందం
దబాగుబళా యనుచు నేగు। సందికోలలవారు ముందటిగములు। నెల్లకెల్లిల్లుల కెల్ల
మైపరగు నల్లగజారూఢమద్వీరగణము। చక్కనసవేత్రిచకచకటి నను చు। పె
కుఱ్ఱవిధంబులందక్కజంబగుచు। వేడుకగోలాటమాడెడువారు। కూడలి త్రిపు
రాంతకుని గొల్చువారు। గేడగూడి వసిదిరిగిరి కేళికలను। కడునొప్పసౌన్నలి కపు
రంపువారు। చేరువనాడెడు వేరిణి విధము। సౌరాష్ట్రనాయకు సాంప్రదాయం
బు। వేడుక ప్రతిజోకలాడెడువారు। కూడలిసంగయ్యకొలుచు నర్తకులు। పా
డుచు నటవిండ్లపై గజ్జపరవు। లాడెడువారు రాయని గొల్చువారు। సంగతి నేగు
తురంగసంఘముల। పింగళి బిజ్జలుముంగలనొప్ప। వర గజారూఢులైయరుదెం
చుచున్న। పరమమహేశ్వర ప్రకరంబునడుమ। శివభక్తజనుల మీదివె దృష్టు
గాగ। సవినయసంభ్రమాసక్తిమొకుఱ్ఱచును। నలఘుసన్మణికలాపాంశులు బ్ర
జ్వ। రిలుమౌక్తికచ్ఛత్రములగమినీడ। సతమర్త్యజనశిరోనాయక రత్న। వితతి
గూడినపదాన్వితనఘంబులను- నెలమిదలిచుఱ్ఱభద్రేభంబు నెక్కి। యులరారుచు
న్నట్టియలమహామహుని। కారుణ్యమూర్తి వికృమచక్రవర్తి। చాగునిర్మలకీ
ర్తిసత్యపరిపూర్తి। కలియుగరుద్రు సత్కరుణాసముద్రు విలసనభద్రు సవిన
యనిద్రు। ధీరుసద్భక్తిశృంగారునేకాంగ। వీరు నా బసవకుమారుజూచితివె।
యనవుడునందరుగనియట్లు మ్రొక్కి। వనితకుమరియొక్క వనితయిట్లనియె। న
లినాక్షి యీతడే నందీశమూర్తి।పొలతి యీతండెత్రి భువన పావనుడు। వనితె
యీతడె భాగవాటి మాదవ్వ। మును నోమిపడసిన యనుగు పుత్రుండు। పడతి
యీతడె మనబల దేవమంత్రి। కడుగూర్చి యిచ్చిన కన్నెకమగడు। సన్నుతాంగి
యితండె సంగయ్యదేవు। మొన్న బల్కించిన ముల్లోకనుతుడు। మడది యీతం
డు యిమ్మను జేశుచేత।కడ చన్నమన్ననబడసినయతడు।కన్నులపండువీయన్నజూ

చినను। పన్నుగాజిహ్వా లపండువువాఁగడ। యిట్టిధన్యు లమాదు మే నేడుమనల। పు
ట్టువుసఫలతబొందె నెంతయును। ననియిట్లు చెప్పచునడుగుచు జనులు। వినుతిం
పగాఁబురిజనజొచ్చి సెడను। జగతీతలేశుండునగరోపకంఠ। మగుడును బసవయ్య
నర్థిఁదోడ్కొనుచు। పరిమితభటమంత్రిపరికరుండగుచు। నరుదెంచిభవ నాశ్రి
యాభ్యంతరమున। మన్ననమంత్రులుపస్నిద్ధరందు। గన్నారుగా బెద్ద గద్దియ
నునిచి। వరవస్త్రభూషణోత్కరములర్పించి। గురుదండబసవయ్య కాతఁడిట్లని
యె। సకలసామ్రాజ్యపూజ్యస్థితి కెల్ల। బ్రకటింపగానీవ పతివట్లుగాక। నాయర్థ
మునకుబ్రాణమునకుబతివి। వేయును నేలనీవె సేను బసవ। నిన్నెనమ్మి తి నంచు నె
య్యమెలర్ప। మన్ననబిజ్జలక్ష్మావిభుండనిన। సకలలోకైకరక్షకుడగుశివున। కొక
నిన్నురక్షించుటకు నెంత పెద్ద। కావునమాలింగదేవుభక్తులకు। నే వేళవెరచుచుం
డింతియెచాలు। నీరాష్ట్రమేలించుటిది యెంత పెద్ద। నీరథిమేరగానిన్ను సేవింతు
ననియూరడిలబసవనదండనాథు। డనుకూలుడై పలుకనంత బిజ్జలుడు। మరియు
గట్టగనిచ్చిమహనీయలీల। గౌరలు నెయ్యమునపిడ్కొలిపె పిడ్కొలుప। గాబ
సవడుభక్తగణములుదాను। నాబలదేవనాయకునిసగళ్ళు। తనకునిజాలయ స్థా
నమైయుండ। దననియోగమఁగోల్వ దాజనుదెంచి। లాలితలింగకేళీల సన్మతిని
లీలానుమోలసచ్ఛీలసంపదల। ననుదినవర్ధమానైశ్వర్యుడగుచు। జనపతి రా
జ్యంబుచక్కబెట్టుచును। దెసలెల్లస త్కీర్తి పసరింపుచున్న। బసవని పూనిక
బాసయట్లున్న। శివరాత్రినిత్యంబు చెల్లించుబాస। శివభక్తులెల్లను శివుడను బా
స। భక్తులయెగ్గులుపట్టనిబాస। భక్తులకులమెత్తి పలుకనిబాస। మృడునైనపొక
మరియడుగనిబాస। యడగినయర్థంబుగడపనిబాస। చీమంత యైనవంచింపని
బాస। యేమువేడిననడుగిడకిచ్చుబాస। తలపెట్టులట్టుల పలికెడుబాస। పలుక
ట్లనడువడిపాలించుబాస। పలికిబొంకనిబాసపొలివోనిబాస। చలమెడపని బా
ససలిపెడుబాస। తప్పవొక్కనిబాసతరలనిబాస। యెప్పుడుభృత్యత్వ మెడ
పనిబాస। కలనైనశివునకుగెలుపీనిబాస॥ గెలుపుభక్తులకిచ్చి గీడ్పడుబాస।
పరసతిపైదృష్టిపరపనిబాస। పరధనంబునకాసపడకుండుబాస। పరనింద నె
య్యడబొరయనిబాస। పరమర్మకర్మముల్ పలుకనిబాస। పరసమయంబుల పరి
మార్చుబాస। పరవాదులను బట్టిభంజించుబాస। హరదూషణకు చెవులీనని
బాస। హరగణానపితంబంటనిబాస। హరగణపరతంత్రుడైయుండుబాస।
హరభక్తులెట్లన్నసట్లనుబాస। జంగమంబును ప్రాణలింగమన్బాస। వెంగలిమ
నుజులవేడనిబాస। భవికిమ్రొక్కనిబాసభవిలేనిబాస। భవబాధలకునగపడకుం

డుచూస। విషయేంద్రియములకు వెన్నీనిచూస। విషమ షడ్వర్గంబు విరియించు
చూస। వేదోక్తభక్తిసంపాదించుచూస। యాది శివాచార మలరించు చూస।
శిరమెట్టచూసినశరణనుచూస। శిరమునకట్టచూసినప్రముకుర్క చూస।ముట్టినచోవె
నర్క మెట్టనిచూస। యిట్టివన్నియుతుదముట్టించుచూస। బసవనిచరితంబు బసవ
డేయెరుగు। వసమె వర్ణింపనైనవాక్పవ్వదలప। ధీరంపుకట్టంగంభీరంపు తిట్ట।
సారార్థములప్రోకజ్ఞానాగ్నికాక- ప్రతినలగుడ్డ।విశ్రుతభక్తిగడ్డ।వ్రతముల
పంటవైరాగ్యంబుపెంట। సత్యంబుకలన ప్రసాదంబుకోలను। కృత్యంబు తా
వయక్రత్యాబ్ధిదేశ। వేదాంతములపాటివిద్యలమేటి।నాదంబుగ్రోలు సమ్మో
దంబుగీలు। శాంతతనెలవుయీశ్వరుకట్టినలవు।దాంతతకలిమినిత్యత్వంబు చే
లిమి। వినయంబుతేటవివేకంబుకోట। యనురక్తి యిల్లునుదాత్తతపెల్లి।తత్త్వం
బుతీగమహత్త్వంబుచేగ। సత్త్వంబులెన్నుయాస్థానంబుచెన్ను। బసవడు కేవలభ
క్తుడేయనుచు। పసిగొనిలోకముల్ ప్రస్తుతిసేయ। నొక్కొక్క నియమంబుని
క్కముగాగ। చక్కనదర్శించవనుదెంచువారు। చేకొన్నవ్రతములుచెల్లించుమ
నుచు। ప్రాకటవ్రతబుద్ధిపరతెంచువారు। ఖ్యాతియోభక్తిసమేతుడో యరసి।
చూతముగాకయంచునువచ్చువారు।బసవనికేబూజబడయుదమనుచు। నెనకం
బుదళుకొత్తనేతెంచువారు।తనిజూచినజాలునభవునిభక్తి।యతిశయంబగునని
యరుదెంచువారు। బసవతీర్థంబుబేగుపరసయునంగ। పసిగొని యిల ప్రిక్కిరిసి
వచ్చువారు। కంతురగాండోళవిరచితానేక। వరరథారూఢులై యరుదెంచు
వారు। ప్రకటరుద్రాక్షసన్మకుటవర్ధనులు। సకలాంగభసితాదిశాసన ధరులు।
విరచితవస్త్రోపవేష్టితమకుట।ఉరుజటాజూటవిస్ఫురితశాసనులు। కత్తుకరస్థలకం
ఠోత్తమాంగ। వక్షస్థలాధికవరలింగధరులు। నుతసంయమీశ్వరులతుల ప్రశస్థ
లతిశీలురితరపాకాదివర్జితులు! సంభావితులుభవిజనసమాచరణ! సంభాష
ణాదిసంసర్గవర్జితులు। పరమశివజ్ఞానపరతంత్రమతులు। నిరవధిలింగైక ని
ష్ఠితేంద్రియులు। స్వచ్ఛలింగానుభవేచ్ఛాత్మసుఖులు। ప్రచ్ఛన్నలాంఛనుల్ ప్రక
టలాంఛనులు। నటులులు గాయకుల్ నవరసాత్మకులు। పటుకళావేదులు బహు
శాస్త్రమతులు। వాదులు తార్కికుల్ వరకవుల్ శక్య। వేదులువేదార్థ వాదులా
డగను। నెడనెడవిభ్రంగిగెడగూడినడువ। బుడమియోకర్కడనొడ్డగెడవర్వ స
నగ। ఖండేందుధరభక్తిగణములిబ్బంగి। దండతండంబులుతా రేగుడేర। పల
సితమృదువాదకలితమార్గములు। వెలుగుముక్తాఫలంబులవ్రుగ్గులమర। మకర
పల్లవమణిముక్తాఫలాది। మకరతోరణములనికరంబునమర। ఖ్యాతిగా వృషభ

డమేతమైయొప్ప। కేతనానీకముల్ గ్రిక్కిరియంగ। నాతతవ్యాసహస్తాక్ర్య తిను
న్న। వాతపూరణములువడిఁ గ్రాలియాడ। నుడిపీథిగప్పిసమున్నతలీల। నడపంది
రులువెలిగొడుగులుదనర। తతవితతాదివాద్యధ్వనుల్ మ్రోయ। నతిశయంబుగ
వినుకలంతంతనమర। పాయకబాగుబళాయనుశబ్ద। మాయతి నాకసంబంధి
ఘూర్ణిల్ల। ప్రతిదినంబునుభక్తిబండారిబసవ। డతిభక్తిరతిమతి నంకురింపగను।
శాశ్వతఘనలింగసంపదమెరసి। యీశ్వరభక్తులం జెదురుకొనంగ। మంగళ హ
స్తాదితాంగవిక్రియల। సంగతినాత్మనుప్పొంగియుప్పొంగి। భయ భక్తియు
క్తితద్భక్తాంఘ్రిచయము। పయుజకక్క జాగిలబడి మ్రొక్కి మ్రొక్కి। పటుతరసద్భ
క్తిపాదాబ్జరేణు। పటవిపర్యంకంబుపైఁబొరలిపొరలి। హరభక్తనికరదయామృ
తవృష్టి। పరిగొనసకురియదొప్పనదోగితోగి। యొడయలదివ్యపాదోదక వార్థి
నడునీటఁగడుపేద్కబడి తేలితేలి। వరభక్తసందోహపరితోషితార్థ। పరమసప
ర్యాసంపదవ్రాలివ్రాలి। మతిలింగజంగమోదితపరతత్త్వ। సతతసమభ్యర్చ రతి
సోలిసోలి। శరణనిర్మలనిత్యసత్యప్రసాద। వరసేవనక్రీడవడిఁగ్రాలిక్రాలి। చా
రువచోవిలాసంబునదనర। నోరారవారిసన్నుతిచేసిచేసి। వారిమనోలతవడిచు
ట్టిచుట్టి। సారగాంధర్వరసముఁగ్రోలిక్రోలి। దరహసితాస్యవిస్ఫురణమై బూడ
హారగణాస్థానంబునందాడియాడి। నికరఘప్రీతితో నికరమైతన్ని। దక్కయం
తయుభక్తిదాసొక్కిసొక్కి। యనవరతమునీప్సితార్థులకర్థి। తను మనోధ
నములప్పనచేసిచేసి। యందందబరమతత్త్వానుభవార్థు। లందత్త్వసౌఖ్య జల
ధిముంచిముంచి। ప్రవిమలభక్తిసంపత్సుఖార్థులను। ప్రవిమలభక్తిసంపదతే
ల్చితేల్చి। యారంగగామసుఖాపేక్షితులను। శ్రీరత్నరాజిబూజించిపూజించి।
వరవస్త్రభూషణోత్కరధనార్థులను। వరవస్త్రభూషణావళిదన్పితన్పి। రా
జవదుపచారపూజనార్థులను। రాజవదుపచారరతిగొల్చికొల్చి। యష్టాంగ
భక్తిక్రియాసుఖార్థులగ్ర। తాంగాష్టభక్తిక్రియలబూన్చిపూన్చి। శీలసంబంధుల
శీలంబులెఱిగి। శీలసంబంధులస్థితినుంచియుంచి। నియమవ్రతాధికనిష్ఠాత్ములకు
ప్రియ వస్తు సమితియర్పించియర్పించి। బసవడీక్రమమునభక్తిసామ్రాజ్య। మెస
కంబుతో జేయ నెడలసత్ప్రీతి। ముప్పూటనోగిరంబులుబదార్థములు। తప్పక
కావళ్ళనెప్పుడుపంప। రెండివేశ్యలయిండ్లనుండిభోగించు। మిండ జంగములు
పండ్రెండువేలనివ। యున్నజంగమసంఖ్యమున్నురూపించి। యన్నంగశక్య మే
యీశునకైన। యనుచుభక్తానీకమచ్చరువంద। ననయంబుభూతి శాసను లాది
గాఁగ। యల్లభక్తాళికియీప్సితార్థములు। చెల్లించుచునుభక్తిసేయునయ్యెడ

ను। పరమేశుభక్తియే ప్రాణమై పరగు। తరుణియా నాగాంబవరతనూభవుడు। ప
స్తుతింపగనొప్పుబసవ కారుణ్యా।హస్తసంభూతప్రశస్త దేహుండు। నసదృశభ
క్తియోగాత్ముండు చెన్నబసవడు గురుభక్తిపాత్రోత్తముండు। సర్వాంగలిం
గిసంసారనిస్సంగి। నగర్వాపహారి। ప్రాక్తనశివాచారి। సార్థగుణాన్వేషి సరస
సంభాషి। కారుణ్యరాశిలింగమనఃప్రవేశి। యగణితసుఖశీలియతిదయాశాలి।
నిగమార్థసంవేదిసచితప్రమోది। విరహితోభయకర్మివరలింగ ధర్మి। యరివ
ర్గసంహారి। యాత్మోపకారి। లింగాభిమానియభంగుర జ్ఞాని। సాంగత్యసువి
ధానిసతతావధాని। పరమానురాగసద్భక్తసంభోగి। విరసభవత్యాగవిమ
లాత్మయోగి। సత్యప్రలాపిప్రసన్నస్వరూపి। నిత్యప్రతాపివినిర్గతపాపి। యీ
శ్వరమూర్తిమూర్తింద్రియవర్తి। శాశ్వతకీర్తిప్రసాదప్రపూర్తి। యనగ నిట్లొ
ప్పారియతులితమహిమ। యనుదినవర్ధమానాంగుడైయంత। బసవని శ్రీపాద
బిసరుహంబులకు। నసలారనిత్యంబునర్చిలిచ్చుచును। మించినభక్తిమైమేనురో
మాంచ। కంచుకంబధికసమంచితంబుగను। గద్గదకంఠుడైకనుగవసుఖస। ముద్గ
తాశ్రువులొల్కనుత్సవంబలర। సప్రాణలింగలింగప్రాణమధన। సుప్రసన్నా
నుభవప్రాప్తిబొంది। నలిగొనమర్కటన్యాయంబునందు। ఫలమునబొందిసో
పానంబులుడిగి। వెనపొందుకలుగువాయసఫలన్యాయ। మసలారగా జరితార్థ
తబొంది। గురుభక్తిఫలసారగుహ్యప్రసాద। వరసేవనాసుఖపరవశలీల। గమనీ
యమొందలింగంబుప్రాణంబు। రసుణ ప్రసాదపూరంబు దేహంబు। తిరము
గుశుద్ధభక్తియెమానసంబు। హరగణానుభవసౌఖ్యంబెధనంబు। నిటు గూడ
నిన్నియునేకమైకాదె। పటుతరంబుగచెన్నబసవడైపేర్చె। భవ్యలింగమునకే
ర్పడబ్రాణముగుచు। నవ్యప్రసాదంబునకురుచియగుచు। జంగమభక్తికాశ్ర
యపదంబగుచు। మంగళప్రాప్తికిమందిరంబగుచు। గురిగాకవాఙ్మనోగోచ
రంబగుచు। వరలెడుశివతత్వవల్లభుమహిమ। బిలిబిలితలపులవలసివర్తిల్లి। మొ
లచినతమతేమకొలదిమాటలను। వినుతించుటెల్లనువెలితియగాదె। కావుననా
చెన్నబసవన్ననెలవు! గావునబసవన్నగణియింపనెరుగు। భావింపనాచెన్నబ
సవన్నయనువు బసవనిమహిమయుభాతిగాచెన్న। బసవండెమెరుగు బెంపె
సగగీర్తింప। నంచుభక్తానీకమచ్చెరువంద। నంచితభక్తిసమగ్రతమెరసి। శా
శ్వతసర్వజ్ఞశశ్వద్గుణాంక। విశ్వేశశ్రీగురవేనమోయనుచు। నమితపరంజ్యోతి
రాకారదివ్య। విమలాంగశ్రీగురవేనమోయనుచు। స్థిరతరసృష్టిస్థితి లయప్ర
పంచ। విరహితశ్రీగురవేనమోయనుచు॥ సకళనిష్కళచరాచరరూపవిగత।

వికృతాంగ శ్రీగురవే నమో యనుచు। నాద్యంతరహితనిత్యామల తేజ। విద్యా
త్మ శ్రీగురవే నమో యనుచు। నధ్వషట్కాతీతయతి పాతకౌఘ। విధ్వంస శ్రీగు
రవే నమో యనుచు। మోక్షార్థిరక్షణదక్షకటాక్ష। వీక్షణ శ్రీగురవే నమో యను
చు। నజ్ఞానతిమిరసంహారార్ధదత్త। విజ్ఞాన శ్రీగురవే నమో యనుచు। ధన్యా
త్మ శిష్యమస్తకన్యస్తహస్త। విన్యస్త శ్రీగురవే నమో యనుచు। నఘహరణార్ధశి
ష్యజనోపభుక్త। విఘ్నన శ్రీగురవే నమో యనుచు। నశ్రాంతభక్తజనాత్మాంబు
జాత। విశ్రాంత శ్రీగురవే నమో యనుచు। ననఘగురుప్రసాదామృతహృదయ।
వినివాస శ్రీగురవే నమో యనుచు। భావిజిల్లనాచెన్నబసవడబ్బసవ। రాజునుతన
గురుప్రస్తుతి సేయ। నంతనల్లమప్రభువనుచు సంయమీశు। డంతకాంతకమూర్తి
యతులితకీర్తి। నిర్మూలితోద్రేకదుష్కర్ములుడుభయ। కర్మనిక్రంతనకర్మ కర్మఠు
డు। వైరాగ్యసంసారవర్జితాత్మకుడు। దూరదృష్టాద్రుష్టచారుచర్యుండు। దా
నప్రతిగ్రహహీనవర్తనుడు। మానావమానసమానకీర్తనుడు। సమలోష్ట
కాంచనసమసుఖదుఃఖ। సమమిత్రశాత్రవసద్భావనుండు। సప్తధాతుమదాది
సర్వాంగుగుణవి। లుప్తచిత్తుండు సంసుప్తిమూరుండు। కాలసంకల్పవికల్పమ
హేంద్ర। జాలప్రపంచనిర్మూలనశాలి। పరమపరానందపరవశీభూతు। డూరు
ముక్తకేశయుతోత్తమాంగుండు। దివ్యానిమిషసుధాదృష్టిభాసనుడు। భవ్యవి
డుగాంధర్వపండితోత్తముడు। ఉరుతరయోగనిరంతరయోగ। వంతుడనంతవే
దాంతవేద్యుండు। నిశ్శరీరిశరీరినిర్నామనామి। నిశ్శబ్దశబ్దినిస్వభావి। ద్వైత
తయోగక్రియాద్వైతయోగక్రి। యాతీతయోగక్రియాన్వితుడనగ। ముల్లోక
ములచేటడెల్లవ్యాభక్తి। కెల్లమై స్వేచ్ఛాభిహీనకృత్యమున। లీలగరస్థలలింగవి
న్యస్తలోచనానందకేళిదన్మరచి। యుడివోరుపల్లంబునిదిచెట్టుగట్టు। నిదితెరువ
డవనిమదిదలపుడిగి। యనుచేగనన్నియునంతంతదొరగి। తెరువిచ్చుటకునరులరు
దనిపొగడ। బసవనియసమవిభ్రాజితభక్తి। రసవార్ధివెల్లివిరిసినట్లవాడువ। వ
చ్చెదద్వీచిప్రవర్తితంబగుచు। వచ్చువహిత్రంబువడువునుబోనె। నిచ్చరత్నప
రిక్షయరిగిచేపట్టు। బచ్చునుబోలెనబ్బసవయ్యప్రభువు। భావంబుసంగయదే
వునియంద। భావనబారయుడుభక్తిమైమ్రొక్కి। రుచిరతరత్నప్రభానిచితమై
యున్న। యచలితస్వర్ణసింహాసనంబెక్కి। ప్రభువున్నసంగప్రభాపటలంబు। ల
భినుతినొందెదిశాంతరాళమున। నోడలజీవముగల్గియును లేనివాని। నడగల్గియు
నువర్తనము లేనివాని। కన్నులుప్రేవులుగాగనువాని। మున్నులింగముప్రాణ
ముగనున్నవాని। చేతనుండయ్యును శ్చేష్టలవాని। ఖ్యాతిలేకయునుతిగడచన్నవాని

పలుకులమీరినబాసలవాని। తలుపులదాటినతలపులవాని । గుణహీనుడయ్యును
గుణమిచ్చువాని। ప్రణవాత్ముడయ్యునేర్పడియుండువాని । గనిశరణనుచుగద్గ
దకంఠుడగుచు। గనుగవహర్షాశ్రుకణములుదొరుగ । బసవడంతంతటబ్రణమి
తుండగుచు। నసలారసముచితాభ్యర్చితుజేసి । లింగతూర్యములుచెలంగను
ప్పొంగి। మంగళారతులెత్తిమహీనత్కణంబ । పళ్ళెరంబిడిపంచభక్ష్యాన్నము
లును। నెల్లపదార్థములెమ్మెల్లంబుగాగ। వడ్డించియబ్బసవండర్థిదోడ్త। దోడ
కళ్ళుగజేసితొడిబడిబట్టి। హరునకుతొల్లియాసురియుచౌడర్సు । కరమర్థినంది
చ్చు।కరణిగొబోలె। నందిచ్చుచుండంగనర్థిచేజేత। నందికొంచునుప్రభువార
గించంగ। పంచిలక్షయొనెనబదివేలజంగ। మంబులకనుచుసమగ్రతదసర। నట
మున్నజేసినయప్పదార్థములు। నిటుగూడసమయుడునెట్లకోయానక। యేనకా
కోగిరంబింకనేననుచు। బూనియాకింపబ్రభువుమెచ్చియంత । కోయనిభక్తని
కాయంబువాగడ। హాయనిసత్ప్రకృపాయుక్తిబొల్పార। బాపురేబసవసద్భ
క్తిసంత్రాణ। బాపురేబసవసద్భక్తిధురీణ! నల్లవోబసవయనశ్వరకీర్తి। నల్ల
వోబసవయ్యనందీశమూర్తి। యమృతంబునందుదివ్యంబగుచేగ । విమలమాణి
క్యగర్భమునదీపంబు। చెరుకునపండుపసిడికమ్మదనము। కొరమైనమలయజకు
జమునబువ్వు। చిత్తరువునకునుజీవంబుపసిడి। పుత్తడికినిప్రాణమునునికరముగ
ను। బుట్టినయట్టులబుట్టితికొడక। నెట్టనభక్తికెనిలుకడయగుచు। నాదుబసవదం
డనాయకబసవ। యాదిబసవయసంఖ్యాతులబసవ । భక్తులబసవయాప్రమథు
లబసవ। ముక్తీశబసవనాముద్దులబసవ। సంగనబసవప్రసాదంబుబసవ। జంగ
మంబుబసవసత్యంబుబసవ। పండితబసవసత్పాత్రంబుబసవ। బండారిబసవసౌ
భాగ్యంబుబసవ। తత్వంబుబసవమహత్వంబుబసవ। సత్వంబుబసవనిత్యత్వంబు
బసవ । వృషభంబుబసవసంవిజ్జ్యోతిబసవ । విషకంఠుబసవవివేకంబుబసవ।
సౌందర్యులబసవసాధ్యులబసవ। నందీశబసవయానందంబుబసవ. తజ్ఞులబసవ
తత్వజ్ఞులబసవ। ప్రాజ్ఞులబసవసర్వజ్ఞులబసవ। సిద్ధులబసవప్రసిద్ధులబసవ। బు
ద్ధులబసవప్రబుద్ధులబసవ। బసవయ్యబసవన్నబసవకుమార। బసవబసవరాజ
బసవలింగంబ। వడిబారుజలమునకొడలెల్లకాళ్ళు। వడిగాలుచిచ్చునకొడలెల్ల
నోళ్ళు। వడిపీచుగాడ్పునకొడలెల్లదలలు। వడిజేయుబసవనీయొడలెల్లభక్తి। బ
సవాయనగవిన్నపానలాండేల। పసులకునైననుప్రబలదేభక్తి। బసవాయనగ
విన్నపానలాండేల। పసిబాలురకునైననెసగదేభక్తి। బసవాయనినభక్తిపరు
లజూచినను। నెసగబత్తులకైననింపదేభక్తి। బసవాయనెడుభక్తిపరులచేరువ

ను। మసలుజంతువులకు నెసఁగదే భక్తి। బసవాయనినజాలుపానలొండేల। య
సమాత్మునకునైనసలరదే భక్తి। బసవాయనినజాలుపానలొండేల యసలారవి
సమైననమృతంబుగాదె। బసవాయనినజాలుపానలొండేల పసిఁగమైకులిశంబు
కుసుమంబుగాదె। బసవాయనినజాలుపానలొండేల। వసుధశత్రులుమిత్రవర్గం
బుగాదె। బసవాయనినజాలుపానలొండేల। వెసగాలుకాఁచిచ్చు వెన్నెలగా
దె। లింగైక్యసౌఖ్యకేళీలోలయుక్తి। జంగమప్రాణానుసంధానశక్తి। యుభ
యప్రసాదసంయోగోపభుక్తి। త్రిభువనంబులయన్నదేయితరులకు। నని పెక్కు
భంగులనగ్గింపుచుండ। ననుషక్తితోడుత నాబసవయ్య। మిక్కిలిసద్భక్తిమిక్కు
టంబుగను। మ్రొక్కుచునందంద మోడ్పుగేలమర। భక్తవత్సలపరాపరపర
మాత్మ। ముక్తివల్లభదివ్యమూర్తిసర్వజ్ఞ। ప్రభువజంగమలింగప్రమథాగ్రగ
ణ్య। ప్రభువసంగయదేవపరమానురాగ। కారుణ్యనిధిసమగ్రతఁజూపినీకు। నా
రగింపగబెట్టునంతభక్తుఁడనే॥

కైలాసమునఁదొల్లికరకంఠుగొలువ। శైలేంద్రకన్యకజనుదెంచునెడను।
మారారియట్లప్రమథవర్గమెల్ల। నారంగసారూప్యధారులైయుండ। పరమేశు
డెవ్వఁడో ప్రమథులండెవరో। యరుదెంచియెఱుఁగలేకంబికనిలువ। పార్వతీసం
దేహభావనయరిగి। పార్వతీశుఁడుదక్క ప్రమథులక్షణము। తమతమతొంటిరూ
పములుపోవిడిచి। రమణనొండొండరూపములుఁబొల్పార। గోమేషవానర కు
క్కుటముఖులు। సామజశరభోష్ట్రశార్దూలముఖులు। మహిషాశ్వసారంగ
మార్జాలముఖులు। నహికేసరివరాహవిహగాదిముఖులు। ద్విముఖచతుర్ముఖ
త్రిముఖైకముఖులు। నముఖపంచముఖసహస్రముఖులు। లంబోష్ఠలంబాక్ష
లంబనాశికులు। లంబోదరులునతిలంబకర్ణులును। గజకర్ణులజకర్ణులజితక
ర్ణులును। విజయఘంటాకర్ణవీరకర్ణులును। బాహూరుముఖులును బాహూ
రుతనులు। బాహుపాదులుపాదబాహువక్త్రులును। బహుబహుబహుపాదబ
హుతాలుజిహ్వ। బహువర్ణబహుకర్ణబహురూపధరులు। నైయున్నప్రమథగ
ణానేకకోట్లు। నాయంబకనియద్భుతాక్రాంతయగుచు। నతులితనిజసహజా
కృతినున్న। పతికిమ్రొక్కుచునుసంస్తుతిపూర్వకముగ। వినుప్రమథాధీశవీరలం
దరును। తనుమనోధర్మముల్ తామిట్లెఱింగి। కామరూపములుచక్కనఁదాల్చి
రొప్ప। నీమహాగణముల కెల్లనీక్షణము। పెట్టుదులిందుసంప్రీతిమైభక్తి। పుట్టె
డునంచువిభూతులిప్పించి। యరిగిమహాకాశమునియమబయల। పరగతత్త్వముల
నుపందిలివెట్ట। యవికలాజాండంబులనుభాండములను। వివిధపక్వాన్నాదివిత

తులుగూర్చి। భవ్యకల్పద్రుమఫలపల్లవములు। దివ్యామృతంబునదవ్వుటచాలించి
క్షీరేక్షురసదధిఘృతములనునిచి। యకలంకరసరసాయనములుగూర్చి। సకలదీ
ర్ఘికలవాసనచేసిచేసి। మరియుజింతామణిమందిరభిత్తి। దరిదరిపదపదార్థ
ములుచిత్రించి। సురభిసహస్రసుస్థిరధర్మపేశ। వరదివ్యలోచనవలయు వస్తువు
లు। వెండియుసమకూర్చుచుండంగప్రమథ। మండలిప్రమథకుమారునినోకసి।
యురయు మాయవసరంబయ్యెనా కాదో। గిరిజాలయంబునకరిగి నీవను
డు। నవ్వుగాకయనివచ్చియంబికగాంచి। యవసరంబేయనియడుగ।గదడవ।
ప్రమథులనిట్టున్నభంగిదోడ్తెమ్ము। ప్రమథకుమారవేపరువునననుడు। నో
క్కింతవెట్టిననోగినారకించి। గ్రక్కునదడ్తెత్తు గణములనెల్ల। నరుగం
గజాలనిట్లాకొనియనుడు। సరసరలింగావసరముసేయుంచి। సొంపారగిరి
జవడ్డింప। బొంపిరియోగిరంబులుబదార్థములు। కులపర్వతంబులంతలకం
ఠ్లుజేసి। నవినారగింపగగలపదార్థములు। నోగిరంబులుసమయుడువెర
గంది। యాగౌరియత్యద్భుతాక్రాంతయగుచు। నెన్నంగప్రమథులకెల్లగా
వించి। యున్నపదార్థంబులోగిరంబులును। మానుగాప్రమథ కుమారుడొ
కరుడ। తానారగించెచిత్రముచిత్రమింక। నేమిసేయుదునని యీశ్వరుక
డకు। హైమవతీదేవిచురుదుంచిమ్రొక్కి। తలవాంచియున్నెడ దరహాసదీ
ప్తి। వెలుగంగప్రమథులవినుతిసేయుచును। గౌరియుందొకచిట్టిగణమిట్టివా
డు। తోరంబుగణములగౌరవంబెట్టు। లవునసంఖ్యాతాస్సహస్రాణి యను
చు। భువినేవమేతన్నిబోధతేయనుచు। తొడగివేదములు సంస్తుతిసేయబో
యి। యడకుచుగడగడవడికెదునేడు। కావునప్రమథులక్షురులనపాయు। లా
విర్భవన్మహామాంధ్యులద్విజులు। నవ్యయులనుపములమరులక్షురులు। దివ్యులు
త్రిభువనభవ్యసన్నుతులు। శుభగులుసుగుణులుసుమతులుశూరు। లభవుల
ప్రతిములత్యానంద యుతులు। వేదాంతవేద్యులువిశ్వైకనుతులు। నాది
కారణులణిమాదిసద్గుణులు। లింగాంశులయ్యాదిలింగసంభవులు। లింగ
మూర్తులుమహాలింగైకతనులు। లింగాశ్రయులుప్రాణలింగసంగతులు।లిం
గసదర్థులులింగానుభవులు। లింగగంభీరులలింగకారణులు। లింగవ్రతస్థు
లులింగచేతనులు। లింగవినోదులులింగసంచయులు। లింగావధానులులింగా
త్మసుఖులు। లింగాభిమానులులింగశాసనులు। లింగసత్ప్రాణులు లింగతత్ప
రులు। సర్వశుభోదయుల్సర్వాధిపతులు। సర్వసంపూర్ణులు సర్వకార
ణులు। వేమేమిప్రమథులకాయంబుమాకు కాయంబుగాకొండు కాయంబుగ

లచె। యేనప్రాణంబుగాకీప్రమథులకు । మానుగాబ్రాణంబుమరొకండుగలడె । యిందొకరుప్రమథునియిచ్చినజాండ । సందోహములుజెడుజనియించునిలుచు । నదిగాకహరివిరించాదిదేవతల । గుదియింతురనుచెల్లయదియెంతపెద్ద । తప్పకిందొకరుడు రెప్పవేసినను । నప్పుడసర్వసంహారమౌననిన । కావునవర్ణింపగాకగోచరము । భావించిచూడుమాప్రమథులమహిమ । మంచుబ్రశంసింపనంబికాదేవి । నంచితమానసాశ్చర్యమైయుండె । నట్టిపార్వతియుమున్నారగించంగ । బెట్టజాలదువిందుపిన్నపాపనికి । దేవదేవస్తుత్యదివ్యలింగాంగ । భావనాతీత । సద్భావసన్నిహిత । శంకరయఖిలసంస్తుతివామదేవ । పంకజప్రభవాదికింకరోల్లసిత । శుభకరచిన్మయజ్యోతిస్స్వరూప । ప్రభువపరాపరభక్తవత్సలుడ । సర్వకళ్యాణసంసారవిదూర । సర్వజ్ఞజీవుసాత్మాంతస్సంగమేశ । నెట్టణనిష్టించినీకానగింప । బెట్టవాశక్యమేపృథుదయాభావ । యనుచుప్రశంసింపనల్లనుమెచ్చి । వినుతదయామృతవనధినోలార్చి। సురభిచింతామణిసురభూరుహములు । వరవులైయుండంగ వరమీగినంత । పెద్దతాననుచుసంప్రీతిచిత్తమున। దద్దసంధిలబ్రసాదముకృపచేసి। తలచినపదపదార్థములుచేకూడ। వలెనన్నవరవస్తువులుదామెబొంద। పలికినబాసయేపాటిమైతనర। నిలిచినమార్గంబెనిలుకడగాంగ। బట్టినపదడైనబసిడిమైవెలుగ। ముట్టినబయలైనమూర్తిచేకొనగ। తొరలినశివునైనవెరవకగెలువ।దరమినజంగమఘట్టణకోర్వజాలునక్షయలింగసంపదనిలిపి। లీలదత్త్వార్థసమ్మేళనంబొలయ। మోహమాయాదితమోరాశిద్రుంచి। దేహేంద్రియాదివిద్వేషంబడంచి। మున్నదత్త్వస్థితిదన్నుదానెరిగి। తన్నునుసత్క్రియోదాత్తతగూర్చి।లీనబైప్రాణంబులింగమందొలయ। గానాథుడాప్రాణిలీనమైయుండ। గానిరంతరపరమానందసుఖము।నూనినశివభక్తియుక్తిమార్గమున। వడిదివారాత్రోపవర్జమేత్తనగ। బడుసదాంతర్యోగభాతిగైకొలిపి। ఘనబహిరంగశృంగారాంతరంగ।వినుతప్రమథసంవిత్సుఖలీల।దివ్యానుభవవార్ధిదేల్పనబ్బసవ।డవ్యాయశివతత్త్వమనువెరింగంత। యుప్పుముల్లియనీరనుంచినయట్లు। కప్పురంబుననగ్గిగప్పినయట్లు। వడిగండ్లవర్షంబువారాశిగురియ।వడువునదాలేకవర్తింపుచుండె॥

ప్రభుచరిత్రంబుభక్తిమైభక్త। సభలందుజదివినసంప్రీతివిన్న। సరససమంచితసచ్చిదానంద। సుగుచిరలింగైక్యసుఖమువర్ధిల్లు । వెండియునొకనాడు।దండనాయకుడ। ఖండితభక్తివికస్వరలీల। జంగమార్చనసేయు సమయం

బునందు। దొంగలు బందివెట్టంగ నూహించి। లింగవంతులు గాని లెంకులకతని। యం
గణాంతరమువకరుగ రాదనుచు। వంగకాయలు కట్టుకొంగుల బాదివి। లింగసన్ని
హితుల భంగి వర్తిల్ల। చనుదెంచి యా బసవన దండనాథు। గనిభయంపడె క్రము
కఱ గన్నులనవ్వి। లింగవంతులు గాని లెంకులకీశ్వ। రాంగణంబున కెట్టులరు దేర
వచ్చు। నింక భక్తులకొక యీశ్వరార్చనలు। కొంకక సేయుదు రూర్చుండు డనిన।
నుల్లముల్ గలుగ నొండొరులఁ జూచుచును। ఝల్లన గుండె దిగుల్లన నవయ। భావిం
పమునమిడ బందిజిక్కెఱితిమి। దేవర గలిగె నా చావు దప్పెడిని। మనకింక నెమ్మోయి
మగుడి పో బోల। దని కృతనిశ్చయులై కూరుచుండ। సరసరమును లింగ సహితుల
పోలె। కరములు సాచుడు కట్టుకొంగులను। భంగి నా బసవయ్య భావసంగతిని। వం
గకాయలు బ్రాణలింగంబులయ్యె॥

నట్టిదకాదె ముక్తి వ్యవహారమేగి। నట్టి చోలింగాలయంబు లేకున్న। సంత
తలింగసంస్పర్శన సేను। మంతరించిన జచ్చున పెనెద్దియనుచు। కుంచిమతి బూరి
గుడివన్నియచట। గుచంబు గొండగోగులఁ బూజ చేసి। కరకంతు గుడియిదికంటిమే
మనుచు। పెరికె సెట్ల తనిబిలిచి చూపుడును। నాయతభక్తి శివాయన మోన। మో
యనియందండ్రమొకిఱ ముమ్మార్లు। పలగొని యింటికి వచ్చి కుడుచుడును। నిలలిం
గమనుచు నేపెఱు మల్లచావ। కుంచంబునకు మ్రొక్కి కుడి చెబొట్టార। కుంచంబు
గొని రండు కొలువగవలయు। నొకటికి కఱరలైన వేవేల్పు। వేకువ గుంచంబు వెం
డియువలయు। ననుచు నా శివదేవునపహసించంగ। వినికూడదని చెయ్యి వీనుల
చేర్చి। చాదుకల్లార సాక్షాల్లింగమూర్తి। గాక కుంచ మెకనుక నిమరి గెదరు।
నమ్మ రేరండు పినాకి బూపెదను। క్రమ్మనన నియేగ గాదొంటి యెడను। ప్రాకా
రనానుముఖ భద్రమండపము। శ్రీకరంబుగ స్వర్ణశిఖరంబు గుడియు। విరచితం
బై యొప్పు వృషభేంద్రుడేమర। నరయుకుంచము లింగమయ్యెనంతటను। నెల్లలో
కములను బల్లేసు దేవు। మల్లయ్య నానొప్పె మరియట్లు గాక॥

కాటకోటండ నాగలడొక్కఁ గొల్ల। యేట పెంట్రుక తన కీశ్వరుడనుచు।
బాలెల్ల బెంట్రుకపై బోటతండ్రి। గేలిసేయుచువచ్చి కాలదన్నుడును। ఖ్యాతసద్భ
క్తిమై కాటకోటండు నాతనికలుగుచు జేతిగొడ్డటను। భూతలంబునబడి బొరిబొ
రిడొల్ల। నేతరి వెనకముందించుక లేక। తలదెగిపడ వ్రేసె తా భవంబ నెడు। పులి
తలదెగ వ్రేయుపాలు పువర్తిల్ల। నికఱడనితడు దానిట్ల వ్రేయుటయు। నకఱడ గై
లాస హర్మ్యకవాట। జాలముల్ గూడ ఝుర్ఝురితమై పడియె। కీలకొగొడ్డలి కై
లాసమునకు। కడుచోద్యమని నరుల్ బుడివుళ్ళు వోవ। నదర పెంట్రుక లింగమయ్యె

నంతటను॥ బంచిన బావూరి బ్రహ్మయ్య భావ। నంబున గాదె జొన్నలు లింగము వ్యా
గావున భక్తుల భావంబు లింగ। దేవు నకును జన్మ దేశంబుగాన। బసవని సౌభాగ్య
భక్తి ప్రభాతి। యనకంబు దలపోయనిది యెంత పెద్ద। కపటంపు శివలాంఛనపరు
లునైన। యపవర్గ కారణులరదియట్లు। నేణాంకధరు భక్తికెక్కినవాడ। రే
ణుశాధ్యైనయక్రియ దలబోయ। ననుచు భక్తానీకమచ్చెరువంద। ననుషక్తి వ్యుచ్చ
లనబ్బసవయ్య। యచ్చులగా బూచి యభిమతార్థంబు। లిచ్చు భక్తుల జేసె సిలన
ట్లుగాక॥

మరియును నొక జంగమంబేగుదెంచి॥ యరిమురియభ్యాంగ నావసరవ
ముస। నిత్య నేమంబిది నేత్రిమ్యగ్గునకు। ముత్యాల పాడి మాకు ముక్కునవలయు।
గదలక మెదలక క్షణమాత్ర లోన। బదిపుట్ల ముత్యముల్ బసవ యిమ్మనని। సరసర
లింగ పసాయతశస్త్ర॥ కరతలు డైజూడక నుదృష్టినున్న। జొన్నల పోకి విశుద్ధ
ముక్తాఫ। లోన్నత రాశిమై యున్న నవ్వుచును। సన్నుత పదిపుట్ల సంఖ్య మీకేల
యెన్ని మీవలసిన నన్ని గైకొనుడు। ననవుడు నట్లకాకనుచు ముత్యములు। గొనిపో
యి బెరుకలదనరసన్నియును॥

మొరటద వెంకయ్యవలు నొక్కనాడు। కరకంరుభక్తుడొక్కరుడర్థ
రాత్రి। నరుదేర బాడగాంచి యడుగులకెరగి। సరసోచితక్రియాసంపూర్ణు
జేయ। మాలింగమునకు నేమమ్మొక్క మొదవు। పాలును మూరేడు పత్తిరివలయు
నటుగాని యవసరంబలవడ నేర। దిట చెల్లునో యని యేగుదెంచితిమి। వెడసే
యరాదిక క్షణంబునను। గడియింపకున్నను కాదు కార్యంబు। హరభక్తు
లూగకేనోరుల నెనడుగ। బోరుగూరికి వేళపోవంగరాదు। యింకనెట్లనమదినిం
చుకేనియును। గొంకక వంకయ్య గొడ్డుం సక్షణము। కొనివచ్చి యొకవట్టె కొరట
సంధించి। మానసిజహరభక్తమండలి దలచి। యాకొరట నెపత్తిరి గొడ్డునంద।
పాకటంబున బాలుబడయుదు ననుచు। గుండ వేగ గడిగి కొనివచ్చి బదుక। గుండ
నిండగ బాలుగురిసె నా గొడ్డు। కొరట నెపత్రియంకురితమై పరగ। వరలనా ము
రటద వంకయ్య కోసి। తెచ్చియాభక్తునకిచ్చి నేమంబు। చెచ్చెరజల్లించె జెప్పజిత్ర
ముగ। ననగవిందు ముదొల్లి యాద్యోక్తులందు। కను గొంటిమిప్పు డీకటకంబునంద
బసవని దృష్టి సంస్పర్శనంబునన। యెసగు జొన్నలపోకయింక జూడ। బొనరు
చు ముత్యాల పోకమైతనరె। ననిభక్తమండలి వినుతింపుచుండ। జెచ్చెర మరియు
నీప్సితవస్తువితతి। యచ్చుగా బసవడిట్లిచ్చుట జూచి। వేడుకయ్యెడు నాకు వేడంగ

ననుచు। రూఢిగాజంగమరూపంబుదాల్చి। చక్కనసంగమేశ్వరుడేగుదెంచి। గ
క్కునపాడవకన్నడుగుటయు। నాయతలింగపసాయతహస్తు। డైయెరుగనే
నీకుమాయనేనుచు। ముకురంబుజూపుడుముక్కన్ననీకు। నకలంకసహజంబయ
పెచూడుమనిన। నద్దంబులోఫాలాక్షుంబుగాంచి। యాద్దేవదేవుండు తద్దలజ్జిం
చి। యప్పుడక్కడనని రాకారమగుడు। జప్పరింపుచుజూచిజాసందపంద। యో
డకుమోడకుయోకోరిసంగ। యోడకుమోడకుముకటియునొల్ల। నెరుగవేస
త్యమాహేశ్వరులిండ్ల। నెరయంకకానినినిజగరినన్ను। దాసయ్యవలెనిన్నుతప
నిధివేడ। నాసిరియాలునట్మాత్మ జుగోర। గనకవృష్టియడుగగరికాలునట్ల। పని
తదునెడపుచ్చమననంబిభాతి। వెండియుగుమ్మరగుండయ్యకిచ్చు। మిండపాప్ర
యంబుగామింపకాజేసి। స్వర్గాపవర్గాదిసౌఖ్యంబులొల్ల। భగణనీప్రమథు
లభక్తులయిండ్ల। నలచుచుడించినయాప్రసాదంబె। కలదుభోగింపగాగల కాల
నెల్ల। సర్వభక్తాత్మమీజలకంబువాడు। గుర్వగామాకాటకోటయ్యగారు। హ
రమీనగరిమాలకరిపుష్పదంతు। డరిదిపూజాంకన్నప్పదేవయ్య। యుండెగట్టెడి
దిమాయింతిరేకవ్వ। ఖండదీపమువాడుగానమినంది। నెట్టణదీవించినీకువిభూ
తి। బెట్టెడువాడుమాపిష్ణనైనారు। యనుషక్తిమైగంధమర్పించువాడు। మనసి
జసంహరమాయెణుకూతిణ। వరదమీధూపంబువాడుమాచయ్య। వరకీతిఙ
మీగంటవాడోహిళయ్య। ధరమంగళారతుల్దర్శించువారు। వరదసోమపగా
రుశరణవత్సలుడ। వంటకట్టెలుదెచ్చువాడుమారయ్య। వంటింపగరికాలుపడి
వెట్టువాడు। కరకంఠయాడబాలచిరితొండనంబి। మరియుచానసముదిమాసంగ
ళవ్వ। కరికాలచోడుపళ్ళెరమిడువాడు। గరికెకావడివాడుఘనుడుహొన్నయ్య
రమణీయముగనోగిరంబులుపరిశ। నమువాడుచన్నయ్యవిమలదేహుండ।యా
రగింపగబెట్టునవసరంబులడి। వీరచోడవగారువిశ్వైకవినుత।యిడపంబువాడు
రేచయమునుసాలు। పదుప్రసాదులుబిబ్బబాచయ్యగారు। మృదుడమానాట్య
నమిత్తండివైద్య। డడరగగల్లిదేవయ్యవెండీడు। చులహారసామవేదులుపురో
హితులు। తెలియబాణకుండిలమాయిభట్టు। కోగిమీపరిహాసకులుకళియం
బ। గారువాగీశనైనారుపాఠకుడు। శ్రీపతిపండితుల్శివుడమీకవులు। నాపండి
తయ్యగారనుగుపండితులు। నాదివీణలవాడుమాదిరాజయ్య। నాదరసజ్ఞుడున
లిశంకరయ్య। కరణంబుకర్మసంహారకేశిరాజు। ధరజగదేవుండుదండనాయకు
డు। గణనాధుడందుశేఖరమీప్రధాని। ప్రణుతించిచూడుమాప్రభువుమీ ప్రభు
వు। యిరవత్తుడుగజసాహిణియశ్వసాహి।వారవుగాబేరమయోగియొడయుం

డు। యనఘరామయ్య యేకాంతంబువాడు। నానరబల్లహుడుకుం బెనసభినద
బి। శంకరనీబంటుశంకరదాసి। యంకంబువాడు సేనాధినాథుండు। లెంకదా
మంచయ్యలీలమీనగరి। సుంకీడుసుంకేశుబంకయ్యగారు। సురియవట్టెడువాడు
సురియచౌడయ్య। బారిగులచ్చిరియారుభువిహేళగీడు। హరమీరుబెజ్జమహాదే
విదాది। ధరరుద్రపశుపతిదామంత్రవాది।సువిధానికకరయ్యభువిజాలవాడు।
శివరాత్రిసంగయ్యచౌలిభోగతండె। దేవరదాసయ్యదేవదాసీడు। భావింపగిన్న
రబ్రహ్మయ్యబచ్చు। మడివాలుమడివాలుమాచిదేవయ్య। కడమలనంబిచొప్పడ
దివ్వటీడు। తెల్లంబుగోడలుడీచేడువాడు। సల్లీలగోడలమల్లయ్యగారు।కుమ్మ
రికుమ్మరిగుండయ్యగారు। జోమ్మయ్యవేటకాడిమ్మహిలోన।కమ్మరమ్మలవాడు
ఘనుడీళ్ళహాళ। జొన్నయ్యకీలారినెమ్మిచెండుండు।మాయావిబల్లేశుమల్లయ్యకో
ట్టు। బోయీడుబాచయ్యభూరికోటారి। పాలుబితుకువాడులీలవంకయ్య। పా
లుగావంగనేర్పరిగొడగూచి। కావునసీదుసకలనియోగంబు। మావారలైయుం
డమన్ననోరమణ। యేమిటగొరతనాకేమిటగడమ। యేమైననడుగునీకిచ్చెదనిం
క। మానంబువదలినమహిదల్లడిలిన। మానుగాప్రమథులయానసీయాన। కాల
కూటముకుత్తుకకురాకమున్న। గాలిపురంబులుగాలకమున్న। గౌరీవివాహం
బుగాకటమున్న। యూరలజాడంబులలరకమున్న। తివిరిమూతుల లెనిమిదియు లే
కమున్న। భువిహరిబ్రహ్మలుబుట్టకమున్న।యటమున్నయటమున్నయటమున్న
మున్న। యిటనీవుసాస్వామి నేనునీబంట। కరకంఠయిట్లెలకళవళించెదవు। వర
లనాచేతబోవచ్చునేయనుచు। నసమాత్మతోడమారంకమైగెలిచె। బసవడుద్య
ద్భక్తిభాతిమైనిట్లు- వెండియునిర్మలాఖండితకీర్తి। దండనాథాగ్రగణ్యుండు
ధన్యుండు। సజ్జనస్తుతుడుబసవడొక్కవాడు। బిజ్జలుకొలువునబ్రీతిగూర్చుండి।
యొడకొడకుమనియొకకడవెత్తు। మాడికిబాహుయుగ్మముచాపదడవ। యిసు
మంతబూడిదనొసలబూసినను। మసలకకొండంతమరులెత్తెననుట। తెల్లవను
చురాజుమెల్లననగుచు।తెల్లవోబసవయ్యశివమురుల్గొంటె।।భమసితితలకెకర
భక్తిరసంబు। కుమతివైనిండినకొలువులోపలను। నోసెబాయనుచునొడకొడకు
మనుచు। బాహుయుగ్మముచాపిపట్టుటేమనిన। స్వగుణసంకీర్తనతగదుసేయం
గ। తగదనియున్ననునగుసభయనుచు। త్రిపురారిగుడితూర్పుదెసనేరునేల। కపి
లేశ్వరంబందుదపసియొక్కరుడు। యాలింగమునకునిత్యమునారుపట్లు। పాలు
మజ్జనమార్పగాలువల్గట్టం। వీధివీధులవెల్లివిరియనేనుగుల। పాదఘట్టనమున
పంకంబురేగ। నావీథిజల్లదానమ్ముచుగణక। బోవుచోగాలూన బోయినవొస

గ। కదురొంపిగాలుజారుడుజల్లకడవ। బడబోవగొల్లెతబసవరోయనిన। బట్టి
తినచ్చటబడకుండగడవ। చట్టనచేతులుజాచియేననుచు। గొల్లెతరూపంబుగొ
ల్లెతయిల్లు। గొల్లెతయున్నయుంకువయుజెప్పటయు। రప్పించిగొల్లెతరాజు
తానడుగ। తప్పకబసవయ్యజెప్పినయట్ల। చెప్పచునొరగినచేతఁగొంపియును।న
ప్పుడుజారంగనంటినకాలి।రొంపియుబూపియురుంగవేయుతని। పెంపునకిదియొ
కటిపెద్దయేతొల్లి। ప్రవిమలభక్తివిభ్రాజితలీల। భువినరవాద్దడిముమ్వూరి లోన।
శ్రీనిలయుడు। తిరుచిట్టంబలుండు। నానొకటిభక్తుడనీశ్వరకేతిఁ। కరమర్థితోవ
రషకాలంబునందు। హరపూజనార్థమై యుందొక్కనాడు।వనిపుష్పములుగొసి
కొనివచ్చునెడను। వననిధితీరంబుననుకాలుజారి। పడివడిపుష్పముల్ పడకుండభ
క్తు। డడరుచుచిట్టంబలాధీశయనుడు। పరముడుభక్తునిపడకుండబట్టె। పరసున
బట్టెనటె బసవలింగంబు। పడినట్టులనుగాక।వసుధీశవినుము। పుడమిని సొన్నలి
పురవరంబునకు। బోయినబోకుదత్పురిసుఖగోష్ఠి। నాయతభక్తసభాభ్యంతర
మున। సిద్ధరామునిజూచిశివభక్తవితతి। సిద్ధుడలోకప్రసిద్ధంబుగాగ। నభినవ
శ్రీగిరియనగనప్పురము। నభిమతలీలసొంపారరచించి। యాపర్వతముమల్లి కా
ర్జునదేవు। నేపారగొనివచ్చి।యిచ్చటనిలిపి। ధృవముగాలక్షయుదొంబదివేల
శివలింగములనుజెచ్చెరప్రతిష్ఠించి। దానికిదగనమర్త్యములోనియన్న। పాన
ముల్ పుట్టకభక్తి పెంపుననుసహజముకుటమునొనలికన్నునుదనర।మహితయో
గానందమహనీయలీల। మేసినీడయుభూవిమెట్టినయదుగు। గానకబడదనగ జ
రింపుచును। యమితసమాధియోగాంతంబునందు। ప్రమథలోకమునకు పన్న
గానేగి। యకటడతత్వరహస్యసద్గోష్ఠి। మక్కువనెక్కొనసమసలి యేతెంతు।
ప్రఖ్యాతమిదినీకు। ప్రమథలోకమున।నాఖ్యాతసత్కీర్తియగుబసవాఖ్యు। బో
డగంటికేభక్తిభూతిసద్గోష్ఠి। కడునొప్పనిక్కడగలుగునకటడను। నతడుండు
నావిందుమఖిలలోకముల। సతతసాన్నిధ్యానుషక్తిమైననిన। శివభక్తతతిజూచి
సిద్ధరామయ్య।ప్రవిమలగతినేడప్రమథలోకమున।నరసివచ్చెదనంచునక్షణంబు
నను। యరిగికైలాసనగాగ్రహర్మ్యమున। నజకలాబుద్ధక్షయాంతకజ్యోతి। ని
జబలప్రపద్యయామ్యనీలరుద్రేశ। యీశానశర్వసద్యోశభగణప్ర। కాశసురాధీశ
గౌరీశధన్య। వామదేవభవోద్భవప్రచండధర। వామదేవోగ్రసంహారపినాకి।
ధాతృవిధాతృహుతాశనశివమ। హోతేజసూక్ష్మలయక్రూరదంష్ట్రి।క్షేమేశవిక
రణార్చిఃస్మంతదమన। భీమాభిధానోగ్రపింగాక్షకత్రిణ। విషధరానంతనివృ
త్తినిధీశ। వృషభగణాధ్యక్షవిభువాయువేగ। హరిరత్నకరబభ్రు హంతాగ్ని

దుఃఖకరసుఖకరను దుంబరకాలరుద్ర। హరిహరబ్రహ్మసౌమ్య స్వామిమృత్యు। హరభయానకహాలాహలపరంధాత్ర। వజ్రదేహావ్యయపటరుద్రశీఘ్ర। వజ్రదంతవినోక్త్రపటవిరూపాక్ష। సహానేశశంభుపంచశిఖివియోక్త్ర। గుహారుద్రబాధకగోపతిశాన। పింగళాసాధ్యమాతంగరోహితను। రంగకపాలధరస్థూలరుద్ర। శాశ్వతేశోర్ధ్వకేశత్రిదశేశ। విశ్వేశచండేశవిత్తేశవృషధ। రాక్షయరుద్రకాలాగ్నిరుద్రత్రి। యక్షఫణీంద్రవినతజులాదిగను। రుద్రచిహ్నాలు గ్రాలరుద్రాత్ములైన। రుద్రగణాధీశ్వరులు చేరికొలువ॥

శ్రీనందినందినాథానందవృషభ। సానందగోముఖహయముఖాభృంగి। దండపాణీశానచండేశరౌద్ర తుండాభగణరుద్రపుండరీకేశ। పర్వతాభరణదర్పసుభద్రసర్వ। సర్వజ్ఞసర్వాత్మసర్వసంహారణ। దారుకరేణుకధవళాక్షవీర। వీరకవీరభద్రారూఢభద్ర। త్రిజటిధూర్జటిలోకవిజయాట్టహాస। నిజబలవిషబలనిశ్శంకనీల। నీలలోహితనిత్యనిష్కళాశాంత। కాలమహాకాళకాలకాలోగ్ర। గూపనిరూపవిరూపాక్షవిశ్వ। రూపపుష్కళశాంతరూప వృషాంక। యుగాంతకభర్గసితగ్రీవపింగ। శ్రోగ్రకాయాతీతయుత్తుంగవిముఖ। కరిముఖనరముఖకపిముఖద్విముఖ। శరభముఖాముఖోష్ట్రముఖశార్దూలముఖ। ముఖచతుర్ముఖపంచముఖసముఖాష్ట। ముఖనవముఖదశముఖషణ్ముఖైక। ముఖ సహస్రముఖదుర్ముఖవికటాక్ష। ముఖహరవిషహరశిఖిహరమృత్యు। హరయమహరగజాసురహరసకల। సురహరాసురహరపురహరభృంగి। గజకర్ణశార్దూలకర్ణాశ్వకర్ణ। విజయఘంటాకర్ణవీరగోకర్ణు। లాదిగాబలశిసదైశ్వర్యలీల। నాదిప్రమథగణావళిగొలువ। సనకసనందనసన్మునీశ్వరులు। సనుగులైతమహత్పదయాబ్జములెబూన్ప। నుపమన్యువామదేవపవిత్రపాణి। కపిలకణ్వాగస్త్యకౌశిక సుబల। శ్వేతదధీచివసిష్ఠకణ్వాత్రి। గౌతమకశ్యపసూతాసిలాత్మ। మాండవ్యహారితమార్కండేయ। పులహశాండిల్యవత్సకుత్సపులస్త్యశక్తిబాదరాయణ। భృగుబకదాల్భ్యరురుసి। లాదమౌద్గల్యపణాదశాకల్య। గర్గశౌనకచతుష్కర్ణమృకండు। భార్గవాంగిరసభాండకశునక। మైత్రేయబల్లకిమంకణచ్యవనమిత్రావరుణనారదాత్రిసావర్ణ। పైలసుమంతసుబ్రహ్మణ్యామంద। పాలసుమిత్రరైభ్యకసత్యసుమహ। పర్వతజైమినిపౌలస్త్యగార్గ్య। దూర్వాసులాదిగాసర్వసన్మునులు। వెలుగునాశీర్వాదవేదనాదముల। నలరుచునందందననుగీతిసేయు। సురనరదనుజఖేచరసిద్ధసాధ్య। గరుడగంధర్వోరగప్రకరంబు। ద్వాదశాదిత్యులేకాదశరుద్రు। లాదినవబ్రహ్మలష్టవసువులు। సురపాగ్నియమదైత్యవరు

ణాగంధవహ। వరవాహహరదిశానాథయాథంబు। శ్రీవాగ్వధూనాథజిష్ణులు
నవిక। లావరణస్థులైయుభయముల్ వేడ। తుంబురునారదాదులుసుగీతామృతం
బునసేయ్యంబుదనరనోలాపఁగ। నంబికాసహితుడైయాస్థానమంట। పంబున
బేరోలగంబుననున్న। శివదేవుగనుగొనిసిద్ధరామయ్య। యవిరళభక్తి సాష్టాం
గుడైమ్రొక్కి। విన్నపంబవధారు। విశ్వలోకైక। సన్నుతమర్త్యాంబుసద్భక్త
జనులు। ప్రమథలోకమునందుబసవడుకలడొ। ప్రమథేశుకొలువునబరికింపుమ
నిరి। బసవసంస్తుత్యసద్భక్తైకదేహ। యసలారనున్నరూపానతిమ్మనిన। యా
లోకమీలోకమననేలబసవ। డేలోకముననులేడెల్లచోనుండు। ప్రమథులయం
దుసద్భక్తులయందు। సమరంగమాహృదయాబ్జకర్ణికను। సతతంబుగురులిం
గచరములయందు। నతిముదంబుననుండునాదిబసవండు। యట్టొటకిటు చూ
డుమాయనిశంభు। డిట్టలంబుగదనహృదయంబుదెరవ। సంగతంబగుకరస్థలము
లింగంబు। జంగమావళికినిశరణనుకరము। ననిమిషుడైచూచుహరుమీదదృష్టిఁ
కనుగవహర్షాశ్రుకణవితానంబు। దరహాసితాస్యవిస్ఫురణయుదనర। బరమ
శివధ్యానపారవశ్యమున। పద్మాసనస్థుడైపరమేశుహృదయ। పద్మంబునందు
న్నబసవయ్యజూచి। ప్రమథులుహర్షింపనమరులుమ్రొక్క।నుమబోటియత్యద్భు
తోపేతగాగ। నామూర్తిగనిసిద్ధరామయ్యయుద్గ। తామితానందపూర్ణా
త్ముడైయుండ। హరుడుపర్వతపుత్రినరవిరికంట। బొరిబొరిచూచుచుపూర్ణేం
దువదన। చూచితేబసవనిసురుచిరమహిమ। మాచెలువీనిల్క డేరికిగలదు। వెల
యగనయ్యాదివృషభేంద్రుడనగ। నలినేనరెండుమూర్తులధరించితిని। వినుతవ
పుత్రోభవిష్యామియనుచు। నేనయశిలాదునకేనుపుట్టితిని। యసలారభక్తి హి
తార్థమైయేన। వసుధజనాంచితిబసవడనంగ। నేసగనిట్టిదకానయీశుండనేన
బసవడఁపేరిసద్భక్తుండనేన। మున్ననుమనబసవన్నసుగుణము। హొన్నతిమె
రుగవేయొగినట్లుగాక। లోకాధిపతినేనులోలాయతాక్షి। ప్రాకటంబుగలోక
పావనుడితడు। కారణలోకసంహారుండనేను। కారణలోకోపకారి యితం
డు। భక్తవత్సలుడనేపర్వతపుత్రి। భక్తరత్నములకుబండారియితడు। భక్తైక
దేహుండభావింపనేను। భక్తజనప్రాణిబసవడీక్షింప। ముక్తికిరాజసూమద్ది
యనేను। భక్తికిరాజసూబసవండుతలప। పసరింపనేలింగపట్టబద్ధుండు। బస
వడుసద్భక్తిపట్టబద్ధుండు। నచరలింగంబనేనచలేంద్రతనయ। సచరాచరక్షో
ణిచరలింగమితడు। చనునాదినాపేరుశంభుండనంగ। వానరద్వితీయశంభుండువీ
నిపేరు। స్థిరభక్తిమమ్మగొల్చినగానిలేదు। ధరవీనిదలచినంతనెభక్తిగలుగు। న

లరుచుబాళిందేహార్ధముల్ షూకు। నిలనిత్తురఖిలభక్తులునొక్కయడను। నచ్చు
గాబాళిందేహార్ధముల్ బసవడిచ్చుచునుండుదానెల్లభక్తులకు। నాయుతమతిబ
సవాయునబరగు। నీయక్షరత్రయంబిట్లొకటిమాటు। చదువునాతనిముఖసదనం
బునందె। కదలకుండుదుము మాగణములుమేము। పొదలునెవ్వనియాత్మనుదిత
సద్భక్తి। యదియుబసవనిమహాత్వంబకాదె। పరికింపనెవ్వడుబడయుప్రసాద।
వరముక్తియదిబసవనిక్రుపకాదె। మదిలోననెవ్వడుమముదలపోయు। నదియె
ల్లబసవనియంశంబకాదె। పసరించుజంగమభక్తియవ్వండు। వసుధలోనది
బసవనివృత్తిగాదె। భక్తిపట్టముదాల్చబసవడు దక్కశక్తిసమేతులు జగ
తిపైగలరె। యదిగాకయొకరు నాయందేలభక్త హృదయస్థుడై చూడని
ట్లున్నవాడు। నంచువెండియు ప్రస్తుతించుచు శంభు। డంచితమతిబసవ
య్యకిట్లనియె। బసవమర్త్యమునందుభక్తులుగలరె। యెసకమేసంసారమి
ష్టమేనీకు। ననియానతిచ్చుడునద్దేవుహృదయు। వనజస్థుడగుబసవండిట్లులనియె।
మందునకైననుమర్త్యలోకమున। నిందుశేఖరుభక్తుడెవ్వడులేడు। భక్తుండనే
ననూభక్తులందరును। భక్తాత్మమీస్వరూపంబకావునను వెండియుగలదొక్క వి
న్నపంబింక। చండేశవరదప్రసన్నతవినుమ।జంగమలింగప్రసాదోపభోగ।సం
గతసుఖసుధాశరధినోలాడు। నిటువంటిభవములెన్నెనియులెస్స। యటయప
వర్గమహిష్టతకంటె। కావునశునకసూకరక్రిమికీటకావహజన్మంబులైనగాని
మ్ము। సుప్రసిద్ధముజంగమప్రసాదంబ। చేప్రొద్దుభోగింపనెట్లుగల్గినను। జా
లువోభవకోటిశతసంఖ్యలందు। నోలినిబుట్టింపునొకటియునొల్ల। ననవుడుగౌ
రీశుడతిదయాదృష్టి। గనుగొనిసిద్ధరాముసీకుజూపుడును। శివునకుమ్రొక్కుచుసి
ద్ధరామయ్య। భువికినేతెంచియద్భుతమునెక్కొనగ। భక్తసమూహాకబసవ
య్యమహిమ। వ్యక్తిగాజెప్పగనట్లనేవింటి। ననువుడుబిజ్జలుడటంతొటకును।జ
నులకునెల్లదృష్టంబిప్పుడిదియ। యనుచునమూల్యవస్త్రాభరణముల। వానరగ
గాళవ్వబోయతకొసగ। యవికలాజాండతత్వాత్మకుడైన। ళివుడుకరస్థలా శ్రీ
సుడైయుండ। సర్వగతుండైనశంభుభక్తునకు। సర్వగతత్వంబుసహజంబ కా
దె। సర్వమయుండైనశర్వుభక్తునకు। సర్వమయత్వంబుసహజంబకాదె। దూ
రేక్షణంబునుదూరశ్రవణము। దూరవిజ్ఞానసిద్ధులుమొదలుగను। నణిమాదిసిద్ధు
లునభవుభక్తునకు। గణుతింపనెంతశ్లాఘ్యంబుదాననుచు। సకలమానవులు మ
స్తకతటన్యస్త। ముకుళితహస్తులైమ్రొక్కుచునుండ। నల్లవోయనుచు భూవల్ల
భుడతులితోల్లాసచిత్తుడైయెల్లవస్తువులు। దట్టుడుబసవనదండనాయకున। కిట్ట

లంబుగఁ గట్టనిచ్చె సంప్రీతి। సుభక్తిశృంగారగుణగణాధార। వరదయాలంకారసురుచిరాకార। ఖ్యాతగంభీరదుష్కర్మవిదూర। గీతమహోదారధూతసంసార। యకుటిలచిత్తశివాచారవేత్త। ప్రకటతత్త్వాయత్తప్రవిమలవృత్తయజ్ఞానజైత్రయుదాత్తచరిత్ర। విజ్ఞానపాత్రసంవిత్సుఖామాత్ర। రూఢవ్రతోత్తుంగరుచిరాంతరంగ। గూఢప్రసాదాంగగొబ్బూరిసంగ॥

గద్య॥ ఇతి యాసంఖ్యాతమాహేశ్వరదివ్య। పదపద్మసౌరభభ్రమరా
యమాణజంగమలింగ ప్రసాదోపభోగ। సంగతముఖసుధా
శరధినిమగ్న। సుకృతాత్మపాలకురికిసోమనాథ। సు
కవిప్రణీతమై శోభిల్లితనరి। చరలింగఘనకరస్థ
అవిశ్వనాధ। వరకృపాంచిత కవిత్వ
స్ఫూర్తిఁ జేసిఁ। చనుబసవపు
రాణమనుకథయందు
ననుపమంబుగ॥

ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.

శ్రీరస్తు.

శ్రీలక్ష్మీగణపతయేనమః.

# శ్రీబసవపురాణము.

## తృతీయాశ్వాసముప్రారంభము.

శ్రీరుద్రభక్తాంఘ్రిశేఖరశుద్ధ। వీరమాహేశ్వరాచారసంగాఖ్య। దండి
తైయిమరియొక్కజంగమము। వేండియుబసవనదండనాయకుడు। మంత్రు
లుదానునుమహీపతివనుప। దంత్రంబునకుజీవితమువెట్టునెడను। వచ్చి యీయ
ర్థంబువలయునంతయును। నిచ్చినగానియొండేనొల్లననుచు। దట్టించియడుగు
డుబెట్టెలమాడ। లట్టున్నభంగినాయయ్యకునొసగ। దంత్రసమేతులైధరణీశు
కడకు। మంత్రివర్గంబేగిమరిరురునిట్లనిరి। చెప్పినగొంటెమాచప్పకయున్న। ద
ప్పగునటుగానజెప్పగవలసె। పనిసేయవెరతుముబసవయ్యతోడ। ధనమెల్ల
నొక్కజంగమునికిచ్చెననుచు। కొండెంబుజెప్పినగోపించిరాజు। బండారుబసవ న
దండనాయకుని। రప్పించిమాయర్థమొప్పించిపొమ్ము। తప్పేమిచాలుప్రధాని
తనంబు। దండింపరాదనుతలపునసిట్లు। బండారమంతయుబాడుచేసితివి। పర
ధనంబపహరింపనిబాసయంద్రు। పరధనంబెట్లుకోబసవగైకొంటి। వేయుమా
టలునేలవెరతుమునీకు। మాయర్థమొప్పించినీవుంతనుండు। మనవుడుగించి
త్ప్రిహసితాస్యుడగుచు। జననాథునకుబసవనమంత్రియనియె। పరమేశుభక్తి
యకల్పతరువుండ। హరుభక్తియకనకాచలంబుండ। కామారిభక్తిచింతా
మణియుండ। సోమార్ధధరుభక్తిసురధేనువుండ। బగతుడాసించునేపరధనం
బునకు। మృగపతియుద్దెసమేయునేపుల్లు। క్షీరాబ్ధిలోపలగ్రీడించుహంస। కోక
రునేపడియలనీరుద్రావంగ। చూతఫలంబులుచుంబించుచిలుక। యేతెరంగుననీ
ల్చునేరేగుబండ్లు। రాకామలజ్యోత్స్నద్రావుచకోర। మాకాంతనేయునేచీక
టిద్రావ। విరిదమ్మివాసనవిహరించుతేటి। పరిగొనిసురియునేబబ్బిలివిరులు। మె

రుగునేయులదిగ్గజేంద్రంబుకోదము। వెలిపండిచనుజీకుమెరుగవుగాక। యరుద
గులింగసమర్థులయిండ్ల। వరవుడనాకొకసరకెయర్థంబు। ఘుడమీశమీధనంబు
నకుచేసాప। నొడయలకిచ్చితియొడయలధనము। పాతికెదరగినభక్తుండగాను।
కాదేనిముడువులెక్కలుజూడుమనుచు। దట్టుడుబసవనదండనాయకుడు। పె
ట్టెలుముందటబెట్టితాళములు। బుచ్చుడుమాడలుప్పొంగుచుజూడ। నచ్చెరువుగ
లెక్కకగ్గలంబయ్యె। మధుకపాండ్యుడుతనమంత్రిచేనిట్టు। లధికయర్థంబిచ్చి
హయములవిలువ। బనుచుడునతడుసద్భక్తిపెక్కువను। చనిచనిజంగమార్చ
నసేయజేయ। నర్థమంతయుబోవహయములవిలువ। నర్థంబులేకున్న నను
మానముడిగి। పోలమునక్కలనెల్లబిలిచికెప్పించి। నలిపాండ్యభూనాథునకుబొ
డసూప। చొక్కనైనారులమిక్కిలికిరుణ। నక్కజబందనానకలన్నియును। యి
లగంకణములుతేజులునయ్యెగాదె। మలహరుభక్తులమహిమదలంప। నిదిచో
ద్యమేయంచునెల్లభక్తులును। సదమలచిత్తులైసంతసంబంద। నతివిస్మయాక్రాం
తుడైబిజ్జలుండు। నితడీశ్వరుడకాక యితడుజేయనుచు। వరవస్త్రభూషణావ
ళిసమర్పించి। పరమానురాగుడైనరులెల్లవినగ। బండారిమీదనెవ్వండేనియింక
కొండెంబుజెప్పనాకుకలజేడి। నాలుకలగోసిసున్నముచాలబూసి। పోలవే
వియుసుమువోయింతునోళ్ళ। ననుచునబ్బసవసింహముఁవీడుకోల్ప। జనుదెంచెన
గరికిజనులునుతింప॥

వెండియునొక్కయ్యవేశ్యాలయమున। నుండిచానిసెబిలచిబండారినగ।
ర। మసనిత్యపడివేడికొనిరమ్ము వేగ। ననవుడునట్లకాకనిపోయియచట। పడతి
యబ్బసవయ్యపట్టంపుచేవి। పొడగనికట్టినపుట్టంబుచూచి। సుసలారపడివేడు
టంతెచాలించి। మసలకబానిసెమగుడిరమ్మంచె। యక్కయేమందునీయాననే
నిప్పు। డొక్కచోద్యముగంటినక్కడికేగి। యట్టిదివ్యాంబరంబఖిల లోకముల
బుట్టదుబసవయ్యపట్టంబుదేవి। కట్టినపటువలిపుట్టంబుచూచి। నెట్టణవచ్చితినీ
కెరిగాప। చావవేడినజాలుబసవయ్యయిపుడ। యావస్త్రమొసగెడునరగలిగొ
నడు। పరగుమహాదేవభక్తులచేత। నరుదరుదనగగణారాధనములు। గొనివచ్చి
జంగమకోటిసస్నేహ। మునరిచ్చినట్టియమూల్యవస్త్రములు। కెంజావళియు
జయరంజియుమంచుపుంజంబుమణిపట్టుభూతిలకంబు। శ్రీవన్నియయుమహాజీని
యాజీని। భావజతిలకంబుపచ్చనిపట్టు। రాయశేఖరముమనురాజవల్లభము। వాయు
మేఘముగజవాళంబుగండ। పడముగాపునసరిపట్టునుహంస। పడిపీడావళి ప
ల్లడదట్టి। వారణాసియుజకువాయుగెందొగరు। గౌరిగనయమును క్షీరోదకం

బు। పట్టునురత్నంపుపట్టునుశంకు। పట్టునుమరకతపట్టుపోంబట్టు। నెఱపట్టువె
లిపట్టునేత్రంబువట్టు। మరితపరాజంబుమాండోదరవిరియు। చంద్రాతపంబు
మసాంధ్యరాగంబు! నింద్రరాగంబుమహేంద్రభూషణము। సన్ననడంచునుశ
రధియుమేఘు। వన్నియరుద్రాక్షువన్నెకాంభోజి! పులిగోరుపట్టునుభూపతి రు
ద్ర। తిలకంబుసరిపట్టుమలయజసిరియు। కోలనిమేఘముగజావళిహయావళియు
వలిపంబుసరిదమ్మితెలుపుదివ్యాంబ। రంబునునుదయరాగంబుదేవాంబ। రంబు
పొత్తియుగుజరాష్ట్రింబుపట్టు। మొదలుగానెఱుగమేమునుతరతరము। పదప
డిమనవారుబడసినయట్టి। మానితవస్త్రవితానముల్గలవు। గానియావస్త్రస
మానముల్గావు। తథ్యమిట్టిదయనిదాసిచెప్పుడును। మిథ్యసేయకవేశ్యమిండని
జూచి। నలిదలిర్పగనీకునాతోడివలపు। గలదేనిబసవనికాంతగంగాంబ। కట్టిన
పుట్టంబుగ్రక్కునదెచ్చి నెట్టణనాకిమ్ము నేర్పుదలిర్ప। ననవుడునట్లకాకనుచుమిం
డండు। చనికాంచిబసవనీవనితగంగాంబ। కట్టినపట్టువలిపుట్టంబుమాడు। ని
ట్టున్నభంగినయొప్పింపవలయు। ననవుడుదనసతినాస్థానసదన। మునకుబిల్వగ
బంచిముద్దియగదిసి। పుట్టుచావెఱుగనియిట్టిమహాత్ము। డిట్టలంబుగనీదుపుట్టమ
డిగెడును। పుట్టమీవేగమీపుట్టమిచ్చినను। పుట్టముమనమునుసట్టిచందమున। లజ్జ
యుసిగ్గుదలంపకబసవ। డజ్జలజాక్షికోకరిమురిబట్టి। యొలువంగనొలువంగ
నొక్కటవస్త్రంబు! దళితాంబుజాననమొలచాయకున్న। గనుగొనియద్భుతా
క్రాంతాత్ములైన! జనములనవ్వుచుజంగమంబనియె। గహనమేజూడజగద్ధితసూ
త్ర। సహజవాహనులగుశంభుభక్తులకు। నవినిడిగుడినయానారనుభక్తు। డిలనా
లిచీరయొల్చెడెభక్తునకు। పంద్రెండువర్షముల్పాయకనేసి పంద్రెండుమూ
రలపసిసిపుట్టంబు। విపరీతగతిదన్నువేడుడుబొక్క। తపసికిదేవరదాసయ్యయీ
డె! యదిగాకబల్లహుడఖిలంబునెఱుగ। సదమలచిత్తుడైసతినిమున్నీడె। యగ
లేకరూపించియదుగంగదడవ। మరిమొన్నయధరుండుమాణిక్యమీడె। దండివై
మొన్నయధరుడిమ్మడించి! మిండభక్తునకుసర్మిలినర్థమీడె। మహినిడుగుడిని పే
ర్మాణిమన్నణము. గహనంపుదుర్భిక్షకాలంబునందు। చాటించిసకలార్థసం
పదల్చంద్ర। బూటుభక్తులకిలుచూరబట్టండె। తనయపెండిలిసేయుతత్ప్రస్తవ
మున। జనుదెంచియొకతపోధనుడువేడినను। యకాకంతవెండ్రుకలప్పుడుకోసి
చక్కనమానకంజారుడీడెట్టు। లనుచుగీటునుబుచ్చుచునుమిండగీడు। కిసియునో
తడవైనతనవేశ్యయనుచు। బసవనివారించివసుధబోవైన। పసిడిచెరంగుల ప
ట్టువస్త్రములు। మోపిడితనమోదమోపినన్నియును। వేపారగొనివచ్చి యి

చ్చెలంజియకు। నిక్కంబుబసవని నిజభక్తిమహిమ। తక్కువగాదయ్యె తరుణీ
మానంబు। ననిభక్తమండలివినుతింపుచుండ।వనితయంతర్వ్యాసమున కేగెనంత॥
బసవనిభక్తిప్రభాపటలంబు। దెసలవసుంధరదివిదీటుకొనఁగ। దినకరు
డాత్మీయ తేజంబుదరగు। ఘనుమదిలజ్జించిచనియపరాబ్ధి। బడియెనన్నట్టుగా
భానుండుగ్రుంకె। చెడిమిత్త్రుడరుగ రాజీవముల్ మొగిచి। భేరులుశంఖముల్ భో
రునజెలగె। మానసంహారునియాగారాంతరముల। నలరుచుబంచమహాశబ్దరా
వములుమ్రోసెభక్తసమూహాలయముల। ఘనధూపధూమసంజనితమేఘము
లు। చెనసికప్పినమాడ్కిఁచీకటుల్బర్వె। వరముక్తిసతిబసవనికీయారతులు।పరు
వడి నెత్తుదీపంబులో యనఁగ। నక్షత్రచయమంతరిక్షంబునిండె। యక్షీణతరకాం
తియసరార వెలిగె। గొరియమృచ్ఛసిశూద్రకుండనురాజు। నరుకువడుట తొల్లి
మెఱిగియెఱింగి। చంద్రునిచేటుదైత్యేంద్రునిపాటు। నింద్యునిభంగంబునెఱిగినె
ఱింగి। జారులచోరులజర్జించుకవుల। ఘోరవివేకంబుపొగడంగనేల। యనఁగ
సంధ్యావేళలందుసద్భక్త। జనులులింగార్చనల్సలుపంగనంత। మిండజంగమ
కోటినిండారుభక్తి। దండనాయకుడంపతండతండములు। ఘనసార తాంబూల
గంధప్రసూన। వినుతాభరణవస్త్రవితతులుగొనుచు। గరమర్థిలంజరికంబు
సేయంగ। నరిగెదమేమంచునురక్తినరుగ। లింగసర్వేంద్రియలీనుండుముగ్ధ।
సంగయ్యనానొక శరణుడీక్షించి। భక్తిననుచువాడుబసవబండారి। వ్యక్తమి
ట్లేగెదరలజంగమములు। కొనిపోపునవిగంధకుసుమకర్పూర। వినుతతాంబూ
లాదివితతులట్లయ్యె। చనునిదిలింగావసర వేళనున్న। పనులకునేగెదుపగిదిదాన
నుచు। నవియునునొక్కలింగార్చనగాఁగ। మదినిశ్చయించిసమ్మదముదొలఁక
డ। కలనైనలంజరికంబనునట్టి। పలుకెఱుంగమిజేసిబసవయ్యజూచి। మేనును
వోదునాయీయయ్యగాండ్ర। తోనలంజరికంబుమానుగాజేయ। ననవుడుగిం
చిత్స్మితహసితాస్యుడగుచు। జనుజీయ్యనాముగ్ధసంగయ్యదేవ। యనిగారవిం
పుచురాయయ్యకపుడు। కనుగొనసహజశృంగారంబుజేసి। పరిచారకులబిల్చిప
టుభక్తిగలుగు। తరుణియింటికిబంపదత్సతిజూచి। గణుతింపప్రమథలోకంబు
కన్యకయొ। గణికసాక్షాద్రుద్రగణికయొతలప।చిత్తరురూపమోచెలువపసిం
డి। పుత్తడిబొమ్మయనపొలతిమేతెంచి। ముగ్ధమిండనిపాదములమీదబడివి। ద
గ్ధమిండెతనసముద్యద్భక్తిమెఱసి। పడిగంబువెట్టించిపాదముల్గడగి। కడువే
డ్కఁబాదోదకములుసేవించి। ప్రీతియలర్పవిభూతివీడియము। లాతస్వితాను
సమర్పణచేసి। యనుపవచ్చినవారలదుగమిండనికి। తనహస్తమిచ్చితోడ్కొని

వోవు నెడను। స్ఫాటికసోపానపంక్తినొప్పారు। హాటకకుట్టిమహర్మ్యస్థలము
న। గలయుంగ గస్తూరిగలయండిమీద। వెలుగుముక్తాఫలంబు। లమృగ్గులమరకం
భకట్లను మేలుకట్టనుబాలుచు। గంభీరపుష్పకాగారంబునందు। మహితలంబిత
రత్నమాలికానిచయ। బహుమణిదీపవిభ్రమకాంతిదనర। మించి వెల్గెడుసట్టె
మంచంబుపుష్ప। సంచితంబగుసండజముపాన్పుదనర। వివిధసౌరభసుఖాన్విత
మగుమంద।పవనంబుజాలకాపంక్తినింపార। శ్రీరుద్రవరదివ్యసింహాసనంబొ।
గౌరీమనోహరుచారుపుష్పకమొ। గంగావతంసునిశ్శృంగారగృహమొ। యంగ
జవిజయునియనుగుమంటపమొ। యనసతిరమణీయమగు నెబ్బుపట్టు। గనిమిండ
డద్భుతాక్రాంతాత్ముడగుచు। యదిమెయానాతిలింగార్చన సేయు। సదనం
బుగాదనమదిలోనదలచి। యుత్తుంగసింహాసనోపమంబైన। యత్తన్వి చారుప
ర్యంకంబుదిగువ। నవనిపైగంబళంబాసనంబుగను। శివసమారాధన సేయగూ
ర్చుండి। భూతిసర్వాంగముల్ బూయుచునతడు। భూతేటపూయవుపోలతినీవ
నిన। యిచ్చబార్వతిబూయుబచ్చవిభూతి। యిచ్చెనొక్కయ్యామాకీమనుమా
వు। పూసిఃసర్వాంగములబూడుమనుచు। భాసురంబగుమేనిపసపుజూవుడును।
వలయుచోరుద్రాక్షములుధరింపుచును। లలనరోరుద్రాక్షములు దాల్పవనిన।క
డుసందులవణసాగరతీరమునను। బొడమినరుద్రాక్షములుసహింపమిని। తెల్లం
బుక్షీరాబ్ధితీరమందుండి। తెల్లరుద్రాక్షలుదెచ్చెనొక్కయ్య। యెప్పుడుదాల్ప
నునైకొనవనుచు। యప్పొలతితనముత్యపుసరుల్ జూప। నకటజులడగుచుము
త్యాలసూచకము। ముకుకనదాల్చినముత్యంబుజూచి। యుత్తమాంగంబునను
విదరుద్రాక్షు। లుత్తమంబయ్యెబోక్రొత్తమాకిదియ। మెకటడవినబడదట్లురు
ద్రాక్ష। ముక్కునదాల్చుటముఖ్యమేయనిన। దేవయేమనిచెప్ప దేవుడేమెరుగు।
నావిశేషంబు వేదాతీతమనుడు। నురుజటావలివిచ్చియొత్తిచుట్టుచును। తరళా
క్షిజడలేలతాల్పవీవనిన। సగముప్రసాదపుష్పములకునునిచి। సగముదాల్చితిగ
డుసన్నపుజడలు। సన్నుతసద్భస్మసమ్మిశ్రమగుచు। వెన్ననని వెచూడుప్రవేలెడిన
నుచు। పటుకళాభరణసంఘటితమైయొప్పు। పటువలికుచ్చులుపడతిచూపుడను।
భువినిట్టిభక్తురాలవుకచ్చడంబు। ధవళాక్షిమరియేలతాల్పవీవనిన। లింగవంతు
లుగానిలెంగులదృష్టు। భంగిగాపయిబారకయుండ। కట్టితిసర్వాంగకచ్చడంబ
నుచు। గట్టినసమకట్టుకాంతచూపుడును। వనితయపూర్వలాంఛనధారిగాక।
మనమునదలపోసిమహిజాగిమ్రొక్కి। యిట్టిలాంఛనమునకెవ్వరాచార్య। లె

ట్టివినియమంబులెట్టిచారిత్ర । తరుణేమీగురుసంప్రదాయంబువారు । ధరణిసై
తావునదపము సేయుదురు। సంతతంబును నేరిసద్గోష్టినుందు। రింతయు జెప్ప
మాకేర్పడదనిన। యాగమనిగమోక్తినవ్వామదేవ । యోగిచేశివదీక్ష మెప్ప
గాబడసి। కైలాసమునదపో వేళమెప్పించి । శూలిచేబడసెమున్నీలాంఛనంబు।
యదిగారణముగబూర్వాచార్యరాలు । సదమలాత్మకహిమశైలతనూజ। శ్రీ
నందనునిగెల్చిశివునిమెప్పించి। మేననర్ఘముగొన్నమెలతవర్గంబు। జగములన్ని
యుతవశక్తిచాలించు। జగదేకసుందరిసంతతిమేము। శివరహస్యాదిప్రసిద్ధశా
స్త్రములు। శివునిచేబడసినచెలువశిష్యులము । యాకాంక్షతోడజన్నాపులపా
లు। చేకొనియష్టావశేషంబుచేసి। చెరుకకట్టెలపొడిచేరెడుజల్లి । మరియిష్ట
లింగసమర్పణచేసి। తప్పకయాప్రసాదంబింతగొందు। మెప్పాటగలనైననెరుగ
మోగిరము। కలిగనేవెండియుగందమూలాదిఫలవస్తుశాకముల్భక్తులిచ్చినను
స్వామికర్పించిప్రసాదంబుగొందు। మేమనిచెప్పదుమీతపశ్చరణ। తనువును
నునమునువిడిచి। మనికులై రసికులైమన్నులైగోష్ఠి। తవులంబుగలిగినతజ్జంగమా
ను। భవమంతయప్పుడుబాయకుండుదుము । యంఘ్రిత్రికాలలింగార్చనమీది।
పనులుదక్కగలేవుపగళులురేలు। గతిమాకువేరొండుగలదెజంగమమ। గతిమ
నోవాక్కాయకర్మంబులందు । యిట్టిదిగురుమార్గముదినిజవ్రతము। నిట్టిది
చారిత్రమిదిలాంఛనంబు। తలపమాగురుసంప్రదాయంబువారు । గలరుశ్రీగిరి
యాదిగానెల్లయెడల। నధికసాక్షాజ్జగదంబాసమాను। లధికంబుగలరుద్రాక్షా
రామమునను। యనిసమంచితవిదగ్ధాలాపములను। వినిపింపనాయయ్యవిస్మితుం
డగుచు। చెలువపర్యంకంబుసింహాసనముగ । దలచిగంధద్రవ్యతాంబూలవిత
తి। రొదబడనంతయొండొండశోధించి । పడతర్ఘ్యపణ్యముల్బట్టునావుడును।
తనరిగనీయయ్యమనసువచ్చుటయు।కనుగొననానేర్పుకలిమిగాకనుచు।హసనం
బుదళుకొత్తనర్ఘ్యపణ్యములు।పసిడిబిందెలబట్టిపడిగముల్వెట్టు। గ్రక్కునసక
లోపకరణంబునీవుపురాతవ్వశీఘ్రు। మాతతంబుగనృత్యమాడుదుగాని।తాళ
ముల్బట్టుడు।తాళగించుండు। నాళతివేళకునందరుననుచు।సవిరళంబుగనిట్టులావి
ర్భవించి।జవనికరప్పించిసరసమైనిలిచి।పొలుపగుముఖరసంబునుసౌష్ఠవంబు।లలి
యుభావంబుమాకళీయుర్ఝుంకంయు।మరియురేవయువిభ్రమమును రేఖతయు।
నెరయంగనీరీతినృత్యంబుసలుప।లింగార్చనంబుసల్లీలజేయుచును।మంగళారవ
ములుసంగడీనులియు! వెల్లవేగుడుస్వచిత్తోల్లాసమమర।సల్లీలనమ్ముగ్ధసంగయ్య
యిట్టు। లంగనపరిచర్యలాచరించంగ। లింగావసరముచెల్లించునంతటను।యో

గిమనొహరునిపాదోదకసేవ। నగణితలీలదివ్యాంగుడనైతి। నఖిలమాహేశస
మగ్రప్రసాద। సుఖసేవనాకింకజొప్ప దునేని। నిలుకాలనిలువగనేరకతిరుగు। న
లమటవాయువొమ్మ సితెఁ పోసి। వచ్చినమాడిఁదివాకరుండంత। చెచ్చరనుద
యాద్రిశిఖరమెకుఁడును। బసవనియాత్మకిఁపెసగమిండందు। వెసనేగుదెంచి
తావెండియిట్లనిదె। బసవయేమనిచప్ప భగుఁడేమెరుగు। నెసగలంజరికమే
నీరాత్రిసేవనీవునుమాతోడరావైతిగాని। వేవునంతకునొక్కవిధమైనసుఖము।
నైనలంజరికమేనచ్చోటజేయు। చోనిన్నుదలచితిజువ్వ య్యబసవ। పుట్టితిగాని
మున్నిట్టుసుఖంబు। నిట్టిలంజరికంబుసెరుగమెన్నడను। మలహరుక్రపలేసిమత్తి
గాంద్రలకు। కలుగునేలంజరికంబిట్లుసేయు॥ సగలురాత్రియునెడతెగకలంజరి
క। మొగియన్నియుగములిట్లొప్పగజేసి। పడసితిచెప్పమాపరమేశుచేత। కడు
నొప్పులింగజంగముసంపదలును। సడిసన్నశివభక్తి। సౌభాగ్యమహిమ।యొడ
గూడునేవెండియొండుమాగఁములు। నాకునునీకారణమునగాజేసి। జేకూరెని
ట్టిలంజరికమీరాత్రి। బండారినీయానపసిబిడ్డనాట। నుండియుశ్రీగిరినుండుదు
మచట। ననఘమాకదలీవనాంతరబిల్వ। వనములనేకాంతవాసంబునందు। ప
న్నగానరకాలకన్నుసనురల! కన్నునుగలమహాగణములుగలరు। చూతుముగా
నియచ్చోటమున్నిట్టి।భూతిశాసనధారిబొడగాననేము। పొలుపగుపచ్చవిభూ
తిపూతయును। తెలుపగురుద్రాక్షములునెర్రజడలు, నంతకుదగిస సర్వాంగ
కచ్చడము। వింతమైయున్నదియింతివేణంబు। నిట్టిలాంఛనధారనిట్టివిరాగ।
నిట్టినిష్టాశాలినేమనవచ్చు। నింతినొక్కతెజెప్ప నేలతత్సతికి। సంతతంబునుబర
చర్యలుసేయు । లలనలందరునట్టి లాంఛనధరలు । చెలువలమహిమంబుశివు
డెమెరుంగు। ననుచుదత్సతులలాంఛనమునునచటి। తనమిండతనవలనుతప్పక
జెప్పు। పలుమారునడుగుచునవిజంగములు॥ చెలగుచునొండొరు చేవేసిసిన
వ్వ। బసవడసమసముల్లసనుడై చెన్న। బసవనిదెసజూచిపసరింపదొడగె। యి
ట్టినెట్టణభక్తియిట్టిముగ్ధత్వ । మిట్టిమహత్వంబునెందునుగలదె। నికఁమీశ్వ
రుగానినిజమెరుంగమిని।ముకఁంటిభక్తులుముగ్ధలుగారె। యనిప్రశంసించంగనా
చెన్నబసవ। డనురక్తిముకుళితహస్తుడైప్రమొక్కి। పరగునీనూతన పాత్రిక్తనభ
క్తి। వరగణంబులలోనవిరచింపజూప। నిలనిట్టిముగ్ధలుగలరొకో యనుచు। నలి
దీటుకొనగవిన్నపము సేయుదును। పరమానురాగసంపదదేలిసోలి। కరమర్థి
మగిముగ్ధగణములకథలు। పసరింపదలచినభక్తిబండారి। బసవయ్యాయాచెన్న
బసవనికనిమె। వ్యక్తంబెరుంగవేయయ్యాలయాల। భక్తుండుమునురుద్రపశుప

తి నాఁగ। ప్రథితమాత్స్యాదిపురాణమందబ్ధి। మథనావసరముక్కఁ కథికుండుజను
వ। కమలజకమలాక్షులమితదైత్యాదు। లమరులుబుచెడిపారనందుద్భవించి। బొ
రినజాండములెల్లదఁగొనికాల్వ। గరళంబుగ్రమింగె శ్రీకంధరుడటిన। యారుద్ర
పశుపతియాలించిభర్గు। డారగించుటనిక్కమావిషంబనుడున్ననుమానమాత్రా
వెహారుడువిషంబు। పనుగొనసటమీదిపనులెరుంగమన। వినిపీగిపడివీపువిరిగి హా
చెడితి। నని నేలబడిపొరలక్కటానిన్ను। వెర్రిచేసిరిగాకవిశ్వేశమెట్టి। వెర్రివా
ర్లైననువిషముద్రావుదురె। బ్రతుకుదురెవిషంబుపాలైనవార। విదియెట్లువినవ
చ్చు నేమి సేయుదును। నికమివ్విధమననిన్నెకానెరుంగ। ముక్కంటివాకింక ది
క్కెవ్వరయ్యా। నాకొరకైనబినాకియివ్విషము। చేకొనకుమియవేనీకుమ్రొక్కఁ
దను। కటాకటా మేనసగంబునసుండి। యాటపోతివవృదనీవెరుగవేగౌరి॥

ప్రమథగణములార పరమాప్తులార। సమసిన వెండిమీశక్యమెకావ। శ
తరుద్రులార యసంఖ్యాతులార। క్షితిధరకన్యకాపతిగావరయ్యా। వీరభద్రయ్య
రోవిషముబ్రాణేశుఁ। డారగించెనికెట్లులవునోకదయ్యా। యోపురాతనుదార
యొకయుండుబ్రతుక। నోవునొకోవిషంబోగినారగించె। చావుదప్పింపరేసద్గు
రునాథు। దీవనబడయరేకావరేశివుని। తల్లిలేనిప్రజలతలతురేయొరులు। తల్లి
యున్నవిషముద్రావనేలిచ్చు। పరమేశుడీబారిబ్రతికెనేనియును। మరణంబులే
దువో మరియన్నటికిని। యానిప్రలాపింపుచుబనువుచునొండు। వినజాలబ్రాణము
ల్విడుతునేననుచు। తడయకఘనజలాంతరమునసురుక। బడకుండనారుద్రపశుప
తిబట్టి। పార్వతీసహితుడై ప్రమధరుద్రాది। సర్వసురసంఘంబుగొలువ। హ
రుండుప్రత్యక్షమై యుడుగుమునీకు। వరమిత్తునెయ్యదివాంఛితంబనుడు। కడుసం
భ్రమంబువమ్మృడుపదాబ్జములు। బడిరుద్రపశుపతిభట్టారకుండు। ఏమియునే
నొల్లనీవిషసేవ। నేమేమిపుట్టునోయేవినజాల। గ్రక్కుననుమియవేకాలకూటం
బు। నికరంబునాకక్కెనీబాగీయనిన। దశనకాంతులుదశదిశలబర్వంగ। పశు
పతియారుద్రపశుపతికనియె। యిటలోకములలోననెన్ననెకాక। యటమ్రింగ
నుమియంగనదియంతపెద్ద। యణుమాత్రనాకంఠమందుజిక్కనది। గణుతింపను
న్నదేకాలకూటంబు। యింతసంతాపింపనేలనీకనుచు। వింతనవ్వేలయంగసం
తసింపుడును। నమ్మంగజాలబినాకియివ్విషము। క్రమ్మననొక్కింతకడుపునొచ్చి
నను। పెద్దయుబుట్టునోపిమ్మటివార్త। తద్దయువినినోపదామున్నచత్తు। స
మయనిమ్మోంచేనిపావనివేని। యుమియుమివ్విషమొండెనొండుచెప్పకుము। త
క్కినమాటలుతనకింపవనుచు। నికరంపుతెగువమైనిష్ఠించిపలుక। నుమియకుండ

గజచ్చునో ముగ్ధయనుచు। నుమబోటియాత్మలో నుత్తలపడగ। యుమిసినకొసి కా
ల్చునో తమ్మనను చు। కమలాక్షముఖ్యులు గడగడ వడవ। ప్రమథులతని ముగ్ధభ
క్తికి మెచ్చి। యమితమహోత్సవులై చూచుచుండ। నొక్కింత నవ్వుచును డురా
జధరుడు। గ్రక్కున లేనెత్తి కౌగిట జేర్చి। ప్రమథులయానసీ పాదంబులాన। సమ
యానిస్విషమున సత్యమిట్లయిన। నమ్మ వేవలపలి నా తొడ యెక్క। నెమ్మి జూచుచు
నుండు నీలకంఠంబు। ననియూరుపీఠంబునందు ధరించె। మునుగురియున్న దేము
గ్ధత్వమునకు। నదె కాక కుత్తుక హాలాహలంబు। కదలినంతట నెచ్చెద గాక య
నుచు। తనకరవాలు రొమ్మున దూసి మోపి। కొసి కుత్తుక యె చూచుచును చెప్ప వి
డక। పశుపతి తొడమీద బాయక రుద్రపశుపతి నేడును బాయకున్నాడు॥

నిలనొప్పు చోళమండలమున మరియు। నలినీలనగ్ననైనారను గణము। యు
విదయుదానును శివలింగపూజ। సవినయప్రీతిమై సలుపుచున్నెడను। శివదేవు
పైనొక్క చలదివ్రాకుడును। శివశివ ప్రేలునో శివునకు ననుచు। య పొలతియు వు
డుతూపొడ్వదడవ। కోపించియాతడు గొంతికట్లః యె। పాపి కాభ్రిమసి తేపాళి
ణవల్లభుని। తూపొడగూడునే తుంపురుల్నిండ। యిటుగ నసీభక్తి యెరుగంగ
రాదె। యెట కేనిపొమ్మని నిన్నే నొల్లననుచు। వెడలంగ నడచియద్విభుడు దా
రాత్రి మృదునర్చనము సేయ నెడ లింగమందు। యక్కొంత తూపొడుచు
చకతిదక్క॥ తకెల్ల ప్రేలిననక జంబంది। పడి వేగ సతి వెంటబారి పాదము
ల। కతిభక్తియుక్తి సాష్టాంగుడై మ్రొక్కి। పాపి పొమ్మని నిన్ను పరచినయట్టి। పా
పంబు సైరించు పటుభక్తి నిరత। నీవు తూపొడిచిన టావుదకంగ। దేవుని మేనెల్ల
జూవె ప్రేలినది। యీదిక్కు తూపొడిచియీ సంకటంబు నా దేవునకు మాన్చ వేద
యాతోడ। ననుచు వెండియు మ్రొక్కనంగ నవచ్చి। తనపతి ప్రాణేశు తనువునను
న్న। పొక్కులుగను గోసి పురపుర బొక్కె। యక్కటా యీ పొక్కులణగు నేయిం
క। పెనిమిటి తన్ను చంపిన చంపనిమ్ము। యనుచు తూపొడవగ యరిగితినపుడు। కా
ననాతప్పున గా జేసి శివుని। మేనబొక్కులు కడునిక్కటంబయ్యె। పోవవేమున్న
తూపొడిచిన చోట నీవలి పొక్కులింకెన్నియు నేల। నానిమిత్తమున బినాకికిట్లయ్యె।
నీనిరోధంబింక నే జూడజాల। ననుచు బరిచ్చేదమై భక్తురాలు। తనశిరంబున కల్లద
ప్పి స్తవమున। తెలివ ముగ్ధత్వంబు తేట తెల్లముగ। మెరయింతు బొమ్మని మెచ్చి
యక్షణమ। భవరోగవైద్యుడు పార్వతీకాంతు। డవినాశుడజుడు ప్రత్యక్షమైనిలి
చి। ప్రమథులు రుద్రులు బ్రహ్మాచ్యుతేంద్రు। లమరసంఘము యథాక్రమమున గొ
లువ। కరుణానిరీక్షణస్ఫురితసుధాబ్ధి। నిరువురనోలాడ్చి యీప్సితార్థములు।

వేడుడిచ్చె దనన వెలదియుబతియు। బోడిగాసర్వాంగములుబొందమ్రొక్కి। దే
వదేవాధీశదివ్యలింగాంగ। నీవుప్రత్యక్షమైనిలిచినమీద। వెండియుమరియొండు
వేడెదమనుట। యొండేమియదియునిన్నొల్లమిగాదె। కావునమీపాదకమలాం
తరంగ। భావసంపూర్ణసంపదగృపసేయు। మనివిన్నవించుడునతివకుబతికి।
ననుపమపరమపరానందమూర్తి। ముఖ్యాపవర్గసముదితోపభోగ।సౌఖ్యత్వ
మపుడుప్రసాదించెశివుడు॥

మరియునువినుబెజ్జమహాదేవియనగ। గరకంఠశ్రీపాదకమలాంతరంగ।
యెల్లనియోగంబులెల్లబాంధవులు। నెల్లవారలుగల్గనిట్లుభర్గునకు।తల్లిలేకుండు
టదావిచిత్రంబు। తల్లిలేకెట్లుగాతగజనియించె। దల్లిసచ్చెనొకాకత్రైలోక్యప
తికి। చెల్లెబోయిట్లేమిసేయంగవచ్చు। తల్లిసచ్చినకాదెతానుదస్వతిని। యల్ల
వారలదుఃఖమిట్టిదకాదె। తల్లిగల్గినవేలతపసిగానిచ్చు। తల్లిగల్గినవేలతలజడల్గ
ట్టు। తల్లియున్నవిషముద్రావనేలిచ్చు। తల్లియుండినవత్త్రోళ్ళుదాల్పనేలిచ్చు। త
ల్లిపాములనేలధరియింపనిచ్చు। తల్లిబూడిదయేలతలభ్రమింగనిచ్చు। తల్లిపుచ్చు
నెఘనితనయునిదిరియు। తల్లిపుచ్చునెసుతువల్లకాటికిని। తల్లిలేకుండినతనయుం
డు గాన। ప్రల్లదుడైయున్నిపాట్లకువచ్చె। చన్నిచ్చిపలుమారువెన్నయుబెట్టు।ప
న్నుగానిన్నిన్నిపాలునుబోసి। యాకొనకుండంగనరసిపాలించి। సాకించిపెను
పదేజననిగలిగినను। తానిండవాడయ్యెతల్లిలేకయును। తానెంతబెరుగునొత
ల్లిగలిగినను। పెంళ్ళిండ్లనోములపేరటంబులను। పండుగదినములపాటిజాతర
ల। తగినపోడిమిసేయుతల్లిలేకున్న। వగువరేమరియిట్టిముగబిడ్డలైన। యూరకు
పేక్షించి। యుండంగదగునె।యారంగదల్లినైహరునినేనైన। సరసెదగాకయి
ట్లరలేకపెనుచు। తరుణియుకాదెట్లుతల్లితాననుచు। యనయంబుబెజ్జమహాదేవి
తాను। జననిమైపరమేశుదనయుగావించి। దొంగిళ్ళపైనిడిలింగమూర్తికిని।
యంగనగావించునభ్యంగనంబు। ముకొత్తుజెకొత్తుముకరన్నుబుబమున
కొత్తుకడుపొత్తునటవీవునివురు। పెనుగంగవలెననితరుణివీడ్వడగ।చరణముల్క
రములుజాగంగదిగుచు। నలుగులునలుచునర్మిలిగట్టిపెట్టి। జలములువీపునజరచు
నందంద। వెగచిబెగడకుండవెన్నుప్రేయుచును। నాగిమస్తకమునసీగొత్తుదొ
యిటను। వదనంబుజొచ్చునోయుదకంబులనుచు। నదుముబొట్టునునోటికడ్డంబు
వెట్టి। చెన్నుగాబసపార్చిసేయుమజ్జనము। కన్నులుచెవులునుగాడంగనూదు।
నంగుడుముల్లొత్తునందందవ్రేల। దొంగిళ్ళిగార్నిరుదొనెత్తిపిడచు। పడతిచేసీర
దూపడచిపెట్టుచును। మడదియంగుష్టంబుమన్నింతమెదిపి। కడవసంటినయట్టి

పిడప విభూతి । యడరబుత్రునినొసలారంగబూయు । నెత్తిక్రుంగెడుననిమె
త్తంగవెరచి । యత్తన్విరొమ్ముననక్కుననదుము । కాటుకయిడునంతకన్నగు
ననుచు । గాటుకయిడుమూడుకన్నులగలయు । చన్నిచ్చుబత్తులజననీదుమీద ।
నన్నాతిగొండినవెన్నయుబట్టి । చెక్కిలిగీటెడుచెలగియేడ్వంగ । నొక్కవ్రేలి
డిపోయునొకకొన్నిపాలు । యుగ్గులువేడగనువిదసంప్రీతి । నగ్గించునగ్గించున
టబుజ్జగించు । ముద్దాడునగియించుముద్దులువేడు । నద్దికోపీరెవ్వరయ్యాలో
యనుచు । పన్నుగానుదరంబుపాన్పుగాజేసి । కున్నజోజరచుచుసన్నుతిబా
డు । కొడుకని యుబ్బంగికొనియాడుచుండ । పడతినిశ్చలముగ్ధభావంబునకు
ను । శివుడునుమెచ్చితాజేకొనియుండె । నువిదగావించుబాల్యోపచారము
లు । శ్రుతిమేవమేవహిరూక్షిణయనియు । స్మృతిసాధకంసంస్మరేత్సదాయ
నియు । ధరదస్యదస్మయతాయాంతియనియు । హరునివాక్యముగానయదియే
లతప్ప । భక్తుడెబ్బంగిగాభావించుశివుడు । వ్యక్తిగాదద్రూపుడైయుంటయ
రుదె । యనిభక్తమండలివినుతింపగొన్ని । దినములుసనగనద్దేవదేవుండు । వెం
డియమ్మకుబ్రసన్నుండుగాదలచి । దండిరోగంబైనతరిచంటిక్రియను । చన్ను
నుగుడువకసంధిల్లినోరు । వెన్నకుదెరవకయున్నయక్షణమ ! బిట్టులిక్కపడిమూ
ర్ఛపిమ్మటినొడలు । బట్టలేకాపదగిట్టినాయన్న । నాకున్ననాపట్టినాచిన్నవ
డుగ । నాకుద్రచన్నేలరాకుడవపుర । నీచెమటయుజూచిసైత్తురునాదు । నో
చెల్లనిటుజూడనోపుదునెట్లు । తల్లిగదన్నయంతటికోర్తునన్న । నెల్లెడనోరు
లనేనెరుగగదన్న । కలిగితిలేకయొక్కడవకదన్న । తలకకయేనెట్లుదరియిం
తునన్న ! నేలపైనాకాళ్ళునిలువవురన్న । యేలపల్కవు చెప్పవేయన్ననీకు ।
యజిమియొకొదమయోయంగుటిముల్లో । యెరుగనుమందు మాకేమియున
నుచు । బనుగుబలవరించుపైబడిపొరలు । కనుతనువుపుడుకుకౌగిటజేర్చు । క
ప్పదెరచుకప్పుకమ్మరదెరచు । దప్పకవీక్షించుదల్లడంబందు । పొంగెడుకడు
పుముప్పననుబొప్పనికి । యుంగుడుముల్లమ్మ్యా । నవినరులనగ । నడలుచుగడుశో
కజలధిదేలుచును । పడతిపుత్రుండున్నభావంబుజూచి । కడుపువెళితిమైనయొడ
యనంబికేని । యెడవోయియచ్చటకడువలేకున్న ! గున్నియుచుగుమ్మరగుండ
య్యావాద్య । మునకాడియచ్చటగానతినలేక । వచ్చిబేరమచక్రవతిజ వాయిం
ప । నచ్చెరువుగనాడియాకటబడలి । వెడయాటలివియెల్లవేగనాడినను । కడు
పునిండునెయనిగ్రక్కునవచ్చి । పిట్టవ్వకైరాచపెట్టికివోయి । యెట్టకేలకునిం
తపిట్టారగించి । సానువేదులయింటజబ్బినపెయ్య । ప్రేమమీరగజేసిపెట్టగగు

కోటికర్చనలు సేయుచున। పాయసాహారము ల్పంచభక్ష్యములు। నాయ
తభక్తిదివ్యాన్నపానములు। డెక్కొనగూడ వడ్డించి సంప్రీతి। మ్రొక్కికర
రాంబుజంబులు దలమోల। పాయకశ్రుతిరసాస్వక్తజిహ్వాగ్ర। గేయనియే
ప్రొద్దు మ్రోయుగావునను। నారంగనీజంగమావతారమున। నోరగిం
పవె దేవ యనివిన్నవింప। జంగమంబారగించంగ దానంత। లింగార్చ
నక్రియాసంగతి నిలిచి। బోరిమజ్జనోదకంబులకటమున్న। పరముడైనానంద
బాష్పముల్ దొరుగ। బూజించు నవపుష్పరాజికిమున్న। రాంజాంకుడైహృత్స
రోజంబు విరియ। ధూపవాసనకుమున్ధూర్జటిమ్రోల। వ్యాపితాంతర్గతవా
సనదనర। వెలుగునీరాజనంబులకటమున్న। మలహరుసందయాత్మజ్యోతిబ్ర
బల। వినివేదితపదార్థవితతికిమున్న। తనప్రాణపదమీశ్వరునకర్పితముగ।
లింగార్చనంబు దాబాంగి సేయుచును। సంగచేష్టలకునంతంత బాయుచును।
సుభగలింగము చూచిచూచి క్రాలుచును। సభవామృతంబాని యానివ్రాలు
చును। సురుచిరోక్తులసోలిసోలి పాడుచును। స్థిరసుఖాంబుధి దేలి తేలియా
డుచును। మంగళోన్నతబహిరంగంబునంత। రంగంబు దనప్రాణలింగస్థ
ముగుచు। నమరెడు నిత్యలింగార్చనవేళ। సముచితనైవేద్యసముదయంబునం
దు। మెలువడినైనసురెవెరికి ప్రాణమున। కొరగోసినట్టుల నొకదెస జేర్చి।
జంగమలింగావసరము చెల్లించు। భంగి నతని ప్రాణలింగంబునకును। ప
శ్చిరమున నెల్ల పదపదార్థములు। పిల్లుగావడ్డించి పేరుపేరునను। నరుదం
దకడికడికందిచ్చుచుండ। కరమధిఁతోకడికడికందుకొనుచు। భక్తవత్సలు
డగుపరమేశ్వరుండు। వ్యక్తిగా చేజేత నారగింపుడును। ముప్పొద్దుప్రాణ
లింగప్రసాదంబు। సుప్రసన్నత జంగమప్రసాదంబు। గూడ భోగింపుచురూ
ఢిబెంపార। వేడుకచౌడయ్య విహరింపుచుండ। హరునకు నిత్యంబు గరికాలచో
డ। నరపతియారోగణము నెమ్మిజలుప। పలుకల నేరిన ప్రాసుంగువ్రాలు।
నలవడముస్నాయరవడిఫుట్లు। సనయుంబుపత్రశాకాదులలోని। కననే
లముప్పందుమట మెరియాలు। నారగింపనెకానియప్పదార్థముల। పేరీశ్వ
డెరుంగ నేరడనంగ। గమియగపదపదార్థములు వడ్డింప। సమరసాయుధు
డయ్యియువలనిల్చుండ! నప్పటికప్పటికాస్వాదనముల। చప్పుడు వినబడనె
ప్పదుశివుడు। ననురాగలీల నెక్కొన నారగించె। ననగ విందుము తొల్లియ
దియునుగాక। మాదర చెన్నయ్య మహనీయకీర్తి। యాదటమదిదులు కాడ
బొల్పాటి। యుంబకళంబుజిహ్వాగ్రంబుపళ్ళై। రంబుగాదనకర్పితంబాచ

రింప । శివుడారగించెఁబ్రసిద్ధిగానంద్రడు । యవిరళప్రీతిమైనట్లుం బెండియును।
వీరచోడవ్వడాక్షారామమందు । నారగింపగజవిరమైనగంపించె । కుడుక
తోడనమరికడిమెత్తనోడి । తడయకపులగంబుదానిఁజెబనుప । పుత్తెంచె
మాయుక్కపులగంబునీకు । చిత్తజాంతకయిదెచేకొనుమనిన । ప్రీతిమైచె
యిజాచిభీమేశుడతివ । చేతిపులగముచెచ్చెరబుచ్చికొనుచు । నారోగణ
ముచేసియందరుజూడ । గోరక్రశంగనవ్రైచెగుడివెలిననగ । వినబడెమరియు
నుమునుగథలందు । గనుగొనబడెమెసేడనురాగలీల । కటకానచౌడయ్యా
కారిచేగళ్లు । నిటలాక్షుడారగించుటయిప్పుడనుచు । నఖిలభక్తావళియం
తగీర్తింప । సుఖలీలనుండెనాసురియచౌడయ్య । సురియచౌడయగారిచరి
తంబువినిన । గరమర్థిజనివినగారవించినను । సహజజంగమలింగసదయా
భవినుత । నిహతప్రసాదవినిర్మలచరిత । స్వానుభవాతిశయానందమలరు ।
మానితసద్భక్తిమహిమవర్ధిల్లు॥

తెలుగుజొమ్మయ్యాగారికథ.

మలహరసద్భక్తిమహితుండుమరియు । తెలుగుజొమ్మయ్యనాఁతిమలా
పహుండు । సంతతసద్భక్తిసహజసౌభాగ్య । వంతుడుసర్వజీవదయాప
రుండు।పుణ్యాపాపోన్ముక్తపూతమానసుడు। గణ్యాపుణ్యోదయకారణాత్మకు
డు।నానందకలితమహాప్రసాదాన।ధ్యానసంధానవిద్యావిశారదుడు।నశ్రాం
తశుద్ధశివాచారయుతుడు। విశ్రుతాంచితకీర్తిపీరసత్తముడు।లోకహితార్థ
డలోకుండుశివప।దైకనిష్ఠాపూరితాంతరంగుండు। కలియుగజనితమృగవ్యా
ధరుద్రుడు। డలఘుపరాక్రముడసమానదాని। శివభక్తిపరతంత్రసిద్ధుండుసక
లభువనపావనుడనభువినుల్లసిల్లి।లింగార్చనక్రియాలీలసల్పుచును। జంగమా
రాధనాసక్తిగ్రాలుచును।ఘనరూఢిగళ్యాణకటకంబునందు।నను రాగలీలజొ
మ్మయ్యవర్తింప। నంతనికఁడశివానందుండనాని। రంతరలింగధ్యానాత్మ
డగుచు । బరమపరానందపారవశ్యమున । బరమకాష్టీభూత భావన
దగిలి । శ్రీశైలమునసముంచితనిర్ఘురప్ర । దేశంబుననుసమాధిస్థుడైయుం
డ । పదనఖంబులుభువిబర్వివెల్గుచును । విదితమైక్రిందికివేళులుహీర । నలి
గరస్థలినఖములువెలుంగుచును । తెలుపారిమీదితీగెలభ్రాంతిబ్రబల । నరు
ముక్తకేశంబులాడలుమించంగ । ధరనీలగిరిమాడ్కిగురుమూర్తిదనర ।
నాయయ్యశిష్యుడత్యాయతభక్తి । బాయకకొల్చుచుబరతంత్రలీల । నన
యంబుగందమూలాహారుడగుచు । ననషక్తిదానునచటనయుండ। నంత

వినోదార్థులగుచుగంధర్వ । కాంతలుపతులునకఁ-డబోయిపోయి । తెల్ల
దీగెలతోడనల్లదనంబు । నల్లదిమెట్టిదోయనుచుదూరమున । శిలయకోశిల
కుతీగలుగల్గుచెట్టు । లిలవృక్షమోవృక్షమేనాకులెవ్వి । ముదియల్లుగానో
పుకదలజాలకయు । యడయున్నదనుచునంతంతవీక్షింప । విదతులపురుష
లనోపులుచూచి । యదయుదైశిష్యుడత్యాగ్రహంబొదవ । గానరాపర
మయోగానందమూర్తి । దానన్యభావనదలపగదగునె । యజ్ఞానులారమృ
గాకృతిగాన । తజ్ఞునిబోల్చినతప్పునబోయి। పుట్టుడుమృగములైభువినంచు
నప్పు । డిట్టులంబుగశాపమిచ్చుడువారు। నంతభయభ్రాంతులగుచునక్షణము
యంతంతబ్రణమిల్లియక్కటామీర । లానతిచ్చినయట్టులన్నియునేల । కా
నమిమాయందుగలిగినెంతయును । నదియునుమున్నపహాస్యభావమున ।
మదినొండుదలనచి మార్గంబుగాదు। నైననుజాలనజ్ఞానంగలదు। తానె
ట్టుదప్పునేతమకర్మఫలము। యిన్నియుననసేలనీశాపమోక్ష। మెన్నడుమా
కింకనెయ్యదితెరగు। యిప్పుడుదయసేయవే మహాపురుష। తప్పులుసైరించి
దయతోడననిన। తప్పదమోఘంబు తమశాపమింక। చెప్పెడిదొండేమిచె
చ్చెరమీరు। పుట్టుడుమృగములైభువినికళ్యాణ। పట్టణాంతిక వనప్రాంతం
బునందు। శూలిభక్తుడుతెల్లుజొమ్మయ్యయనగ। భూలోకపావనుడాలింగ
మూర్తి। చేమీకుమరణంబు సిద్ధించెనేని। కామించుశాపమోక్షంబగుమరి
యు।నాయయ్యచేజచ్చునమ్మాత్రజేసి । పాయనిముక్తిసంపదయుసిద్ధించు।
ననవుడునట్లకాకనుచుగంధర్వు। లనురాగమున గటకాంతికంబునను। మృగ
ములైతొల్లింటిమెలతలుబతులు। తగిలియరణ్యమధ్యమునజనించి। మదిలోన
తెలుగుజొమ్మయగారిరాక। కెదురుచూచుచునున్నయెడనొకనాడు। య
లరుచునయ్యరణ్యాంతరంబునను। తెలుగుజొమ్మయపత్తి రిగోయుటకును।
మెల్లనయేగగమృగములితండ। తెల్లంబుగానొపుతెలుగుజొమ్మయ్య। యను
చుచుట్టునునిల్చియరచుచునెందు। జననీకయరికట్టైకొని యొకఁ-మృగము।
మరణంబుమీచేతమాకైనగాని। కరుణాత్మశాప మోక్షంబుగాలేను। వేడు
కమైనిత్యవిధికైనవేట। లాడపేమామీద నఖిలోపకార। గంధర్వులందొకఁ-
కార్యకారణము। సంధిల్లమాకిట్టిశాపంబువచ్చె। ననుచుతద్వృత్తాంతమంత
యుజెప్పి। కనుగొనశాపమోక్షంబులగుటయు। దానికఁ-మిదియమీచేనేము
సావ। గానవుడుదివ్యవిమానముల్వచ్చి। కొనిపోవుకైలాసమునకుతక్షణము।
జనులకు నెల్లదృష్టప్రత్యయముగ । నరయుశాపంబె మున్నాయయ్య

యాగి । వరముగాకిదిమాకు పరికించిచూడ । నవధరింగగలదదిమెట్టు
లనిన।తవిలిమున్నేము గంధర్వలోకులము ।యమలాత్మమాకింకనపవర్గపద
విసమకూరుమీచేతనచ్చుటజేసి। యదిగానమమ్ముదయామతిబూచి। బ్రదికిం
పవేయని(బ్రస్తుతించంగ । నతఁడయనూనతిక దివ్యజ్ఞానదృష్టి । వీక్షించితత్కా
ర్యమెల్లానెరింగి। యరుగుటచాలించియంతనమగుడి। కరమర్థిగొంతపత్తి
రిగోసకొనుచు। సరసరనసమానశరణాగ్రిగణ్యు। డరుదెంచికనుగొనియ
నురాగలీల। పచ్చనితలచుట్టుపచ్చకుబుసము । నచ్చెరువుగవిల్లునమ్ములువ
ట్టినందనవనమరణ్యంబుపైవిడియు । చందనంబునుసహజక్రియబొల్చు।బ
లువేటకారునాపంచాస్యుమీరు। చలమునుబలమును గలజాగిలములు(దను
బరివేష్టించికొనియేగుదేర। నరఘుండుజొమ్మయ్య చననరణ్యమున। నమ్మృ
గావలియుబ్బి జొమ్మయ్యమీద। గ్రమ్మనజనుదేర గావేటకారు। సడికెలడ
యుమ్యుడుసారమేయములు। నడరనంకమెపొలె విడిపించికొనుచు। పొంగిమ
నోవేగమునగూడముట్టి। యుంగదమృగములనార్చుచునేయ। కుకర్లజంకిం
చికోలలకెగసి । జక్కనజొమ్మయ్యశరములకెదిరి। వచ్చుశాపమోక్షం
బులుగాంచి। యచ్చోనగంధర్వులై నిల్చితెలుగు। జొమ్మయ్యగారిపాదమ్మ
లకెరగి। సమ్మదలీల(బ్రశంససేయుచును। నతనిచేమరణంబులగుటనజేసి।యు
తులితాగణ్యపుణ్యప్రాప్తిబొంది। (బ్రవిమలకనకదివ్య విమానములను। శివ
లోకమునకుచెచ్చెరనేగుచుండ। కూ్రరతనెగిడెడు కుకర్లమొరగి, తారే
యుశరములుదప్పించుకొనుచు। జొమ్మయ్యచేతన (క్రమ్మనజచ్చి। యమ్మృగ
రూపంబులణగిమ్రొక్కుచును। గంధర్వులైకనక విమానములను। సంధిల్లనే
గుటాశ్చర్యంబుగాదె। యదెకుకర్లెగిడెనానంలోపలన। యిదెపోయెపో
యెనానెగసిపోయెడును। నెప్పాటనైనదారేయుబాణములు । తప్పనేతా
కియుడాకవచ్చెడును। మృగములకేనాటుమించివెలుంగు। గగనంబుననుక
నకవిమానపంక్తి। మేదినికారణ మృగరూపధారు। లాదివీరెవ్వరోయాతడ
యెరుగు। నితరుడేజొమ్మయ్య యిహలోకరుద్రు। డతులకారణపురుషావ
తారుండు। ననితోడివేటకాండచ్చెరువంది। వినుతింపనిబ్భంగివేటలాడుచును
నిచ్చెడుమృగములనెరిబొలియించి। యచ్చుగాశివపురికనుపుచునుండియుర్వీ
శుడాదిగానొక్కొకనాడు। సర్వజనంబులుజనుదెంచిచూడ। హరుభక్తవి
తతియునరుదెంచిచూడ। నరుదనిపొగడ జొమ్మయ్యవీక్షించి। పృథుగురు
ధ్యానమున్నిండివాలమున।(బ్రథితసంసారవాస్వంచాస్యుదృంచి। మునుభక్తద

ర్శనంబను ముద్గరమున। జనుపురాకృతకర్మ మనుదుప్పిజంపి। గుర్వాజ్ఞయనుకత్తికుంతంబునందు। పూర్వాశ్రమంబనుపులిబడబొడిచి। సుజ్ఞానమనువాడిసురియచేపట్టి। దుర్జ్ఞానమనువరాహంబుజెండాడి। యాయతసద్భక్తియనుతోమగమున। మాయాప్రపంచమన్మనుబోతుదునిమి। వినుతశివాచారమనుకుఠారమున।జినలోకపథమనుశివ్వంగిజదిపి। విమలప్రసాదమన్వెల్లిపూరించిభ్రమితేంద్రియములనబడుసిర్లనేసి। భాషాప్రణీతమన్నలుబల్లగోల।నీషణత్రయమనునెలుగుకన్నొడిచి। హరుమహాత్వంబననడ్డాయుధమున। పరబాదులనుమృగోత్కరముగీటడచి। వెలసినయాబలువేటకానికిని। యిలమృగంబులజంపుటిదియెంత పెద్ద। యిదిగాకపరికింపనరుగుచోనతని। పదఘట్టనలజచ్చుబహుజంతువులకు।నగుమోక్షమనినజొమ్మయ్యచేజచ్చు।మృగములేగుటచోద్యమేశివపురికి।ననుచునబ్బసవయ్యయధికమైపొగడ। ఘనకీర్తిగళ్యాణకటకంబునందు। చోద్యతరంబుగాజొమ్మయ్యచిరస। ముద్యద్గుణాంకుడైయుండెదెల్లముగ। తెలుగుజొమ్మయ్యనిర్మలచరిత్రంబు। నలవోకజదివిననర్థిమైవిన్న। రాజ్యాభిషిక్తుడై రంజిల్లుప్రీతి। పూజ్యతలింగ సామ్రాజ్యంబుబొందు॥

సారంజంగమపాదసరసిజయుగ్మ। ధారాళమకరందధౌతశిరస్క। శారదనీరదహారనీహార। తారామరాహార ధవళయశస్క। యంచితకర్ణరసాయనకల్ప। సంచితపరిపాక సత్యవచస్క। మహనీయరుద్రాక్షమాలికాభూతి। విహితమండనకాంతివిలసదురస్క। సంకాఖ్యసమసుఖసదమలపాణి। లింగనిరంతరలీనమనస్క॥

గద్య—యిదియసంఖ్యాతమాహేశ్వరదివ్యపదపద్మసౌరభ్రమరాయమా
ణజంగమలింగప్రసాదోపభోగ, సంగతసుఖసుధాశరధినిమగ్న।
సుకృతాత్మపాలకురికిసోమనాథ। సుకవిప్రణీతమైశోభిల్లిత
నరి।వరలింగఘనకరస్థలవిశ్వనాథ।వరకృపాంచితక
విత్వస్ఫూర్తిబేర్చి। చనుబసవపురాణమను
కథయందు। ననుపమంబుగబంచ
మాశ్వాసమయ్యె

శ్రీగురుచరణారవిందాభ్యాన్నమః॥

హామిలా. కందుకూరి-శ్రీశైల-వీరభద్రవరప్రసాదరావు.
ఏలూరు గోదావరిజిల్లా.

లక్ష్మీగణపతయేనమః.

# శ్రీబసవపురాణము.

## షష్ఠమాశ్వాసము.

### ఏకాంతరామయ్యగారికథ.

శ్రీమన్మహాభక్తచిరతరవరద । యామృతపూర విహారసంగాఖ్య । మరియునేకాంత రామయ్యనానొక్క । నెరవాదిభక్తుండుకరకంఠమూర్తి । శమదమస్ఫురణానుషక్తుడుజైన । సమయకోలాహలుడమితప్రతాపి । యతులితశివసమయప్రతిపాలు । డతిశయవీరభద్రావతారుండు । విస్పృహేంద్రియగుణాన్వితచేతనుడు । నస్పృశ్యభవిజనుడపగతభయుడు । లింగసమ్యజ్ఞానిలింగావధాని । లింగగంభీరుడభంగురకీర్తి । యేకాంతభక్తిసుశ్లోకుడుమర్త్య । లోకపావనుడుత్రిలోకవంద్యుండు । ధీరమహోదారశూరగంభీర । సారగుణస్తోమధౌరేయుడనగ । నెగడినిత్యక్రియానియయతప్రయుక్తి । తగిలిశివార్చనాంతమునసత్యర్ద్ధి । ప్రమదలోకమునకుద్గమలీలనరిగి । విమలాత్మవీరకవీరభద్రాది । గణనికాయమునకుప్రణమిల్లివారి । గుణకీర్తనలుచేసికోర్కెవైవార । శివభక్తితత్త్వానుభవసదేకాంత । సవిశేషసుఖసుధాశరధినోలాడి । యప్పటట్టులభువికెలమినేతెంచి । ముప్పూటనిమ్మార్గమునజరియింప । బసవనిభక్తిసంపత్సముద్రంబు । దెసలవసుంధరదివినట్టవాముప । స్వచ్ఛందుసందర్శనేభనేతెంచి । ప్రచ్ఛన్నభక్తినబ్బసవన్నజూచి । యాకటకమ్మునసేకాంతరాము । డేకాకియైచరియింపుచునుండ । నొక్కజైనుడుచెప్పులూడ్చకవచ్చి । జక్కనశివనివాసంబుజొచ్చుడును । లోపలరామయ్యకోపించిచూచి । యీపాపమునకెంక నేగురిగలదు । రోరిజైనుడతగదుడురాజధరున । గరాంతగముచెప్పుగాళ్ళజొరంగ । గడవజొచ్చితిననిమ్ముడునకుజాగ । బడిమ్రొక్కుచెప్పులుపారంగవైచి । యటుగాకతక్కినయంతకోద్దండ । పటుదండభాధలపాలయ్యెదోమ్మ । యింకచెప్పులదోడయిట్లుంటివేని । శంకింపనిప్పుడసందుసందులకు । నరు

కుదుసనవుడుబిరుసనకతడు । నరిమురియింతేలనాగ్రహించెదవు।ముక్కం
టిగుళ్ళకుదిక్కుగలిగితివి। నిక్కపుభక్తుండనీవేలవెరతు। గుడివసదియువేల్పు
టొడయుండుజినుడు। నుడువకుకాఁదేనిపడయు. మామగుడ।తలదరిగిప్పుడమ
లహరుచేత। నిలనీవెభక్తుండవితఁడెవేల్పనిన। నితనిజంపుటయంతయిదిముద
వింప।ప్రతిజ్ఞాపకుండుటపంతంబుగాదు।శిరమిచ్చివడయుదుజినసమయంబు
శిరముద్రుంపుదుబాసజెల్లింతుననుచు। శ్రీకంఠుభక్తికిఁజేవయెక్కంగ। యే
కాంతరామయ్యయిట్లనిపలికిశిరమిచ్చిపడయుటయరిదియంచేని।పరవాదివి
నరమాభక్తులమహిమ । యొక్కభక్తుండుజంబురిమహాకాళు। డక్కజంబు
గశిరమభవునకిచ్చి। యిలయెల్లనెరుగంగనెలమితోఁబడసె। తలయట్టతోఁగీలు
కొలిపిప్రాణంబు।యటవార్తకలిగియాకటకంబునందు। పటుమతిగోవిందభ
ట్టారకుండు । శివునినిర్మాల్యమిచ్చినమస్తకంబు । తవిలిచికొనుటిదితప్పత
ప్పనుచు । కరకంఠునకుతలదరిగిపూజించి। నెరయమూనాళ్ళకుమరియొండు
శిరము । వడసెవెండియునొక్కభక్తుఁడివ్విధము । కడునపహాసంబుగాప్ర
తిష్ఠించి । మూఁడుదినంబులుముక్కంటియచట । లేడొతానచ్చినవాఁడకో
యనుచు । మొరటదవంకయ్యమారిమురిశిరము । తరుగగమొలువగదరగ
గమొలువ । తరగెడుతలలునాతరగనిభక్తి , తరగమిగాఁజేసెతదవసరము
న । పూన్చెడుశిరమును పూన్చినశిరము । పూన్చినపిమ్మటబుచ్చెడుశిరము ।
మొలిచెడుశిరమును మొలిచినశిరము। మొలువగలోలోనలిదోఁచుశిరము। తరి
గెడుశిరమునుతరగినశిరము । తరుగకతనుదానవారగెడుశిరము । సరసర
హరుమీదసంధిల్లుశిరము । బోరిరొయ్యనొయ్యనబొడవగుశిరము । యు
న్నతిమీదనయుండెడుశిరము । కన్నులార్చుశిరముకాదనుశిరము । మిన్న
కెళవుమ్రోలమెలగెడుశిరము । సన్నసేయుశిరముజరిగెడుశిరము । నారు
చుశిరమునౌనౌననుశిరము। కేరెడుశిరమునుదారెడుశిరము। పారతెంచుశిర
ముప్పైబడుశిరము।గారవంబునశివుగలిసెడుశిరము । బొబ్బిడిశిరమునునుబ్బె
డుశిరము । గుబ్బునబడి తద్దగునిసెడు శిరము । నాలుకల్గ్రోయుచుగేలిగొ
న్శిరము । శూలినివెక్కి రించుచు నుండు శిరము । యురికిపడు శిరము
నారగెడుశిరము । మరియునుసంధిల్ల దరుగుడుశిరము । పొగడెడు
శిరము నునగివెడు శిరము । తెగడెడు శిరమునుదీవించు శిరము ।
శరణనుశిరమును జయవెట్టుశిరము । సరసమాడుశిరము చదివెడుశిర
ము।మలసెడు శిరమునవ్వారక్కనుశిరము । తలకకీశ్వరుతోఁడదాకెడుశి

రము। బావనుశిరమును పాడెదుశిరము । బాపండయనిశివుజంకించుశిర
ము।విప్పాటపసిగమైయీశ్వరుబూన్ప । కుప్పలుగొనితలల్గుడిపికఱటిల్లి।
మారారివిస్మయమానసుండగుచు । నోగోరివంకనాకూరుపువోదు। రోయ
డితినన్నను మేడెపువాడువ । బాడియేనీవీర భక్తికినిలువ। నావశంబేయ
నిదేవదేవుండు । యావంకతం దెశ్రీహస్తంబువట్టి । యనురాగమునబో
ల్చినత్తలలెల్ల । తనలింగమూర్తిలోననధరియించె । శంకించుచునునరు
ల్సంస్తుతిసేయ । వంకయ్యశివునిమారంకమైగెలిచె । నిటువంటిభక్తులనే
కులుగలరు । కుటిలాత్మవిననీకుకొలదిగాచెట్లు । నెరుగవేతొల్లిమీయేడ్గడ
వారి।బరచినమాశివభక్తులమహిమ । తిరునావలూరనుపురిదిరునావ। కరి
శుండనగజైనగురుడొక్కరుండు । జినసమయాచార్యుడనజనునట్టి । ము
నిశూలకుబ్టైత్తిమూల్గుచునేల । బడిపొరలుచుబ్రాణపరితాపమందు। నెడ
వారితోబుట్టినేతెంచిచూచి । యీమంత్రతంత్రలూలామూలములను। నో
మలజేసినీకుడుగదునొప్పి। బ్రదుకంగవలతేనిభక్తసమ్మతిని । మదనసం
హారుదివ్యమంత్రంబుగరవు। వేగంబనీకునిరోగమయ్యెడును । రాగిల్లిఱగా
ష్టిత్తార్థములువొందెదేని । యనవుడుభక్తుండనయ్యెదనింక । యనుమావ
మొక్కిఱంతయునువలదనుచు । శపథంబుసేయుడుజయ్యెదనతివ । త్రిపు
రారిభక్తులదివుటదలంచి । యనుపమదివ్యపంచాక్షరీమంత్ర । మునభసిత
మలందిమొగిదిగదుడువ । శూలకుట్టుడుగుడుచోద్యంబునొంది । యాలల
నకునతడష్టాంగమెరగి । పడతినీకతమునబ్రదికితినింక । నడరభక్తుండనేన
య్యెదననుచు । శ్రీపతినాథునాజ్ఞాపనజేసి । నాపగలూఁదికినరిగియక్కఁడ
ను।నిలపంకమందున్నజలరుహమట్ల । వెలివాడనున్ననిర్మలసుచరిత్రు।గురు
మూర్తిగదిసియత్తిరునావకరిశు । డరుదందసాష్టాంగుడైమ్రొక్కినిలువ।
ముదమునదద్గురుమూర్తియునంత । పదపడిశివభక్తిపరుజేయదలచి।తన
దుకృపాలోకనమాత్రజేసి । ఘనపురాకృతకర్మకల్మషంబడచి। భసితసమై
శ్వర్యపట్టంబుగట్టి । నాసలిదుశ్లేఖలుగసిబిసిచేసి । శివతీర్థకలశాభిషిక్త
మొనర్చి । సవిశేషలింగసంస్కారగమొనర్చి । సంచితశివహస్తసంగతుజేసి
పంచభూతవికారపథమునబాపి । యంగలింగనియుక్తమంగళక్రియల।సం
గతసత్యప్రసాదాంగుజేసి । విగతవాయుప్రాణవిధులాచరించి! నెగడలిం
గప్రాణనిష్టితుజేసి । సిద్ధమంత్రమునబ్రసిద్ధుగావించి । శుద్ధాత్మచిన్మయ
జ్యోతిగీలించి । వినుతజీవన్ముక్తికినిహేతువైన । యనుపమశివరహస్యా

ర్థముల్దెలిపి। తమకరుణాప్రసాదముకృపజేసి । విమలసద్భక్తిసంవేత్తగా
వించి । తిరునావకరశియుతేజిష్ణలీల । పరమశివాచారపారవశ్యమున।భ
వభక్తవితతికిభువిజాగిమ్రొక్కి । శివమహోత్సవములుసేయగబనిచి।వా
హనవస్త్రసువర్ణాభరణస । మూహార్చనక్రియల్మొదమునజలిపి । వలపా
రదనమనోవాక్కాయకర్మ । ములబ్రాణదేహార్థములునివేదించి । భూతి
రుద్రాక్షవిభూషణపరమ । పూతవ్రతస్థుడైభువిబ్రవర్తిలప । నన్యదర్మ
సమార్గుడయ్యోవీడనుచు । నన్యాయమునజైనులందరునతని । కరికివెట్టు
డుభద్రకరిముట్టనోడె । కరిచర్మధరుబంటుగరియేమిసేయు। విషమువెట్ట
గుడిచివిజయుడైనిలిచె । విషసంహరునిబంటువిషమేమిసేయు। బహ్వాగ్ని
ద్రోయబైబడకాచెనగ్ని। జిహ్వాంతకునిబంటుజిచ్చేమిసేయు । జలనుల
ముంపుడుజాలవుముంప । జలమౌళిబంటునుజలమేమిసేయు । జంపగనేక్రి
యజాలకతమ్మ । జంపునోయితడనిశరణజొచ్చుదును । కంటకులగుజై
నకర్ముల గాచి। తొంటిలాంఛనములుదుడిపించియంత। రుద్రాక్షభసితావి
రూపితపంచ । ముద్రధారులజేసిరౌద్రముతోడ । వెసజనిపత్రిమలవిటత
టమూర్చి । వసదులన్నియువ్రచ్చివైపించెగాదె । లలిజైనసమయకోలా
హలుడనగ । గలుగుమాతిరునావకరశుదేవుండు॥

## రిత్తాండికథ.

రయోరిచెల్లతిరువాలూరమరియు । మారారిభక్తుడుమహానిరిత్తాం
డి।యనగనొక్కయ్యజాత్యంధుడైయుండి । మనసిజహరునకుమజ్జనార్థమం
గ। గుడిముందటనునొక్కకొలనుగావింప। గడగికుద్దాలంబుగంపయుగొ
నుచు। త్రవ్వుచునొకశంకుదరినొకశంకు । త్రెవ్వనిత్రాటసంధించిచేపట్టి।
ప్రమోకువెంటననెడత్రోకుచుజుట్టు । ప్రోకగాబోయుచుప్రొద్దులుపుచ్చ। జి
నసమయులుదీనిజెరుపుదడనుచు । గనుగొనిపెక్కువిఘ్నములుగావింప।ద
లరకెప్పటియట్లద్రవ్వుచునుండ । నిలమోకుదెంచిశంకులుబారవైచి। కరకం
టుచేనవుడుకన్నులువడసి । యరిమురివసదులువెరికివేటాడి । జినసమయు
లనెల్లజీకులజేసి । కనుపడెగాదెమాగణమిరిత్తాండి।మరియు(శ్రీ)కాశినా
మహినొప్పుపురిని । నెరిశివబ్రాహ్మణునికినుదయించె । యలరికుమారుని
యంశంబునందు। నలువొందగాబిళ్ళనయనారనంగ । జనకుడునొకనాడు
తనచంకబెట్టి। చనిసరోవరతీరమునబాలునునిచి । తానఘమర్షణస్నానం
బుసేయ । గానభోపీథినగౌరియుశివుడు। మానితదివ్యవిమానసిరూఢ!యా

నులుచనిచపియల్లబాలుండు । మనకుమారునియట్లయనుచునగ్గిరిజ। కనుగవ
జూచుడుజనుగవ సేవ । నవనితలంబునకరుదెంచిచాలు। కౌగిటజేర్చికూక
టిఫ్రుడుకుచును । జేవిదాశాంభవదీక్షితుజేసి। భావించిశివభక్తిపరునిగా
వించి। కడుపారజనుబాలుగుడిపిపసిండి। కుడుకతో వెండియుగొన్నిచేనిచ్చి
గౌరితానీశ్వరుకడకేగనంత। నీరగ్రుంకినధరణీసురోత్తముడు! భోరునలేచి
విస్ఫారదివ్యాంగ। చారుదీధితిగ్రాలుసత్పుత్త్రుగాంచి । యోరిచన్నిచ్చినవా
రెవ్వరిచట! నోరెడవిపసిండకోరయుచాలు। యవ్వరెతెంచిరియెకడికేగి
రెవ్వలనున్నవారిటజెప్పుమనుచు। జన్నిదంబుననుచేజాచిగ్రేయుదును।తిన్న
సివగవునుసన్నపుటేడ్పు । కన్నులదొరగెడుచిన్నిబాష్పములు। గ్రన్ననసె
లవులకారుదుగ్ధములు । చెన్నొలయుగగోరచేతగప్పుచును । యన్నన్నన
న్నేటికడచెదువినుము । దివినల్లపోయెడుదేవదేవేశు । కపనుండియయ్యు
మాకాంతయేతెంచి । యురుజటాజూటభాస్వరుకడనుండి । చిరమణిమ
కుటభాస్వరయేగుదెంచి। తగచంద్రరేఖావతంసునినిల్పి। సుగుణావతంస
దత్తునదతయేతెంచి। ముక్కంటివానిసమ్ముఖముననుండి। యిక్కంటితో
వొక్కయింతియేతెంచి। కరమొప్పునీలకంధరుకడనుండి। సరసరకంబుకం
ధరయేగుదెంచి। ఘనచందనాంతవక్షస్థలుబాసి। స్తనచందనాంకవక్షస్థలి
వచ్చి। యురగేంద్రహారుసియూరులనుండి। వరరత్నహారసుందరియేగుదెం
చి।యామమోక్షగమనునరమేననుండి । కామినివరహంసగామియేతెంచి।
ముల్లోకములరేనిముందటనుండి । ముల్లైరాకములకెల్లతల్లియేతెంచి। చన్ని
చ్చికడుపారమన్నించిమరియు। గొన్నిపాలుపసిండిగోరలోబిదికి। నిలిపి
వచ్చిననీలగళుసిపాలికిని। పొలతియల్లదెచూడుపోయెదుననిన। యామహీ
సుతుడద్భుతాత్ముడైయయ్యు । మామహేశ్వరులకుమహిజాగ్రమొక్కి।
కొడుకుదానరకటనిడుకొనివచ్చి। మడదియుదానుసమ్మదలీలనుండ। పార్వ
తిస్తనవయఃపానప్రశక్తి। సర్వజ్ఞతయువచఃస్సంసిద్ధిదనర। వేలినగుడికేగి
వేవేలవిధుల। భావించిపార్వతిప్రస్తుతించుడును । యంబికస్వర్ణతాళంబు
లిచ్చుడును ! తుంబురు నారదాదుల మీరిపాడ ! కరిమర్ది తోడశ్రీ
కాశినాథుండు । విరచితంబైయొప్పవెలిగొడుగులును । యక్షయనిధియు
ముత్యాలపందిళియు। నీక్షితిబ్రబలేని హేమాసనంబు । ఖండేందుధరుడవు
డుకరుణింపగనక । దండెయందలమెక్కి తావైభవమున । భాతిగాధార
లుపరమతధూమ । కేతువునాగప్రఖ్యాతమై మోగియు । నురుతరలీలగు

లోత్తుంగచోడ । ధరణీశుశివభక్తిపరునిగావించి । యలరుచుసుగతసహ
స్రద్వయంబు । గొలువగజనుబౌద్ధునిచారదోలి । లీలమైమరిరెండువేలబౌ
ద్ధులను । పాలించిశివభక్తిపరులగావించి । తిరుమరకటాడయును పురిబ్రబ
హ్మేశు । చిరకవాటములుసుస్థితిదెరపించి । తిరుపాళనాయనబరగునప్పు
రికి । యరుదెంచిజైనులయందుదయించి । యిలసర్పదష్టుండైయీల్గినయట్టి
వెలమనిప్రాణంబువేగంబెపడసి । మధుదేశుదేవిసమ్మదమునజేసి । మధుర
కేతెంచుమధుకేశుకడకు । జైనులుబౌద్ధులుచనుదెంచియపుడు । జ్ఞానసం
బంధినాగానొకటశిశువు । యాతతవేదబాంహ్యసమణధూమ । కేతుం
డునాక్రొవ్విమేతెంచినాడు । పురివెడలింపుమునరనాథయనిన । గురుడ
టేయచ్చోడనరపతికతడు । యూరకవెడలించుటుచితంబుగాదు । వారి
నోడింపుడేవామునసైన । యనుడుజైనులుపదియెనిమిదివేలు । చనియెట్లుత
రిటంపజాలకనిలిచి । యర్థరాత్రంబందుయతడుండునింట । స్వర్థ
మైచిచ్చితజ్వాలనుండువెరచి । యెదురవిల్వగఖడ్గనేమేమిగోరి । సదనంబు
గాల్వగాదనుదెంచితీవు । విహ్వాలుగావించివీరభద్రుండు । జిహ్వాలునీరెం
డుచేతులతొల్లి । కోసివైవగనున్నకొరతనీముక్కు । గోసివైపించికొనమ
రిగదవా । జైనులగీనులశక్తిచూచెదము । దానతప్పేమియీభూనాధుమే
న । బ్రాపించియుష్ణజ్వరస్వరూపమున । దాపమొందింపుమురహానకాచితి
మి । యనవుడునతని దేహంబునబొంది । ఘనతరజ్వరరూపమునగొనికాల ।
మంగయకటరసియన్మండలేశ్వరుని । యంగనతనపతియనుమతంబునను ।
తానపుడురప్పించిజ్ఞానసంబంధి । కానాతిసాష్టాంగమైవిన్నవింప । నో
రెవ్వరేకలరారాజుమేని । యిరుజనాపగనెంతియువలయు । వలపటమూపా
లువామభాగంబు । బలహీనురాలమీపాలుమంత్రింపు । డంచునుభూతి
మంత్రించిచల్లుదును । సంచితంబుగమేనిసగమునబాసి । వామభాగమునన
జ్వరమిన్మతింప । నామునుల్మంత్రింపనగ్గలంబైన । నారోగముడుపవేశ్రీరు
ద్రమూర్తి । యీరుజమూన్పవేకారుణ్యపాత్ర । నాతెవులార్పవేనల్లనైనా
ర । యీతాపముడుపవేయాఢ్యచరిత్ర । నాగదచాపవేయోగీంద్రవంద్య ।
యీగహనజ్వరమెడలింపుతండ్రి । యనిపెకుటవిధులమహారవంబులియ । జ
నపతిప్రార్థింపజ్ఞానసంబంధి । క్రమ్మనభసితంబుగలయగజల్లి । మున్నూరు
దిగదుడ్పిముట్టినంతటను । పోరటపొంద్యేశుడుపాలుపారమున్న । పోర
డుపోయినవీపుపొరదుమానుటయు । భావింపబొంకమ్యోజావకపోవు! నా

పీవుఫొరడనియాడుమాటయును ! గూనిపాండ్యుండనుహీనత్వముడిగి !
తానొప్పెనంతసుందరపాండ్యుడనగ। రెట్టించిదాపటదొట్టినజ్వరము । చట్టి
ననుదుగుడుసతియునుదాను! భువిసమస్తాంగముల్ప్రాఁదంగ మ్రొక్కి । యువ
సరోచితసత్క్రియాదులొనర్ప । యింకనేమిటికటయేరికొండనిన। శంకర
మూర్తికిజైనులిట్లనిరి। జినమంత్రలేఖయుశివమంత్రలేఖ। యునునగ్నిలోవై
వనొగిగాలకున్న। వారిదిగెలుపనివారునుడువ్రుడు। ధారుణీశ్వరుఁజూచిదానద
ప్పెమి। పసిడితోనొకటుకకపల్లఁదూచుడును। పసిడియునెనుకయుప్రతివో
ల్పదగునె। పాలకావడితూనికరాలబూన్పుడును। పాలునురాలునుప్రతియె
తలంప। మలయజంబులువట్టిమ్రాకులుబూన్పు। మలయజంబులువట్టిమ్రాకు
లుసరియె । శివమంత్రలేఖయు జినమంత్రలేఖ ! తవిలి కూర్చిన నేమిత
త్తుల్యమగునె । యంచునుశివయను నక్షరద్వయము । పంచవర్ణా
ధ్యండుపత్రికవ్రాసి। మండలాధీశుండురెండులేఖలును। మండెడుపెనుపగు
మంటలోవేసి । కరమెత్తునంతనసురసురగమరి । పరవాదిజినమంత్రప
త్రంబుగాలె। హరమంత్రపత్రమయ్యగ్నిగన్న । సరసిజదళమట్లకరము
ప్పియున్న। జినమునుల్తలసచ్చియునుతోకసావ । కనిరిముమ్మాటికినరయ
గవలయు । శివమంత్రలేఖయుజినమంత్రలేఖ । తవిలికావేరిమధ్యంబునవేసి
యు। యేటపోయినపత్రమోటపత్రంబు। నేటికినెదురెక్కిసిదిఃజంబసిన ।
పిడికిటకోమట్బాడువగమరియు । బాడువుమాయనుక్రియబోవగరాదు ।
యూరకపోనీకుమోడినవారి। ధారుణిజనులెల్లతలలెత్తిచూడ। మెఱగాగా
ల్పించియిచ్చెటనినుప। కొఱ్ఱులదీయించుకువలయేశ్వరుడ। యనవుడునాగా
కయనిజినమునులు। జనపతియునుదారుజనుకొంచియంత । నాకులుకావే
రియందువైచుడున। చేకొనియదురెక్కిశివమంత్రలేఖ । వారిమంత్రంబా
కువరిదసేకలిసె । పూరించునేచమత్కారమంత్రములు। యంతనాపిళ్ళనై
నారుభూనాథు । సంతోషమలరారసద్భక్తుజేసి । పదనెనుమిదివేలమొద
లిజైనులను । పొదిగొనిపిలిపించిబారిబారిబట్టి । యచ్చరువందగులచ్చిరియా
రు । చెచ్చెరనటమున్నచేయించినట్టి । కాలియున్నయినుపశూలంబులందు
నొలిదీయించుచువ్రాలియిద్ధరణి । పరగగదిరునూరబరవుటవినవె । యు
రుభక్తియుక్తిమైయోరిజైనుండ॥

సిడుమూరునకథ.

వుడమినట్టులచెప్పబడియెవెండియును । నిడుమూరుడననొక్కనిఖిలేశ్వ

రుండు । దనమేలుభూమిచాదకుండకేహల్ల । జినమార్గవర్తులౌటనువిశే
షించి । మందునకైనభస్మత్రిపుండ్రాంగి । యెందులేకునికికియెట్లకోయను
చు । మదివిచారించుచునునుజేయుచుండంత । నాదవసరంబునమదనారిభక్తి ।
మానసుండగుశివజ్ఞానసంబంధి । నానప్పుడాపాండ్యభూనాథుధరణి । కే
తెంచివీరమహేశ్వరోద్యుక్తి । ధాతిగాఁబ్రభవించిపరవాదులైన । జినమా
ర్గవర్తునినుపక్రోత్రులను । కనలగదివియించెననుచునీవార్త । వినియటనిడుమా
రువిశ్వంభరేశు । డనఘుడుతనదేశమునవెన్నబడ్డ । జినపథాచార్యులజిన
మంత్రయుతుల । ననసేలవీకువారనకరాబనిచి । క్షితినవాంతరశాస్త్రమ
తనులుపన్ని । శ్రుతిబాహ్యులైచనుమతిహీనులార॥పశుకర్మునొకనరుప
రమేశుడనుచు । బశుపతినెరుగనిపశుజీవులార । పాసపరిశూన్యదుర్బోధ
లదగిలి । భసితంబలందనిపాతకులార ॥ యద్వైతకర్మమాయాకుయుక్త
లును । సద్విధిజెందనిచండాలులార । యజ్ఞానబోధలకాలయంబగుచు
విజ్ఞానరతిలేనివిద్వేషులార । యెట్టకోనాప్రజనింకకాలంబు । బట్టిదుర్బో
ధలపాలుచేసితిరి । యటుచూడుడాయిప్పుడభవుసద్భక్తు । డటుపిళ్ళనా
యనారనచాండ్యభూమి । సర్వప్రమాణదృష్టప్రత్యయముల । శర్వుడ
కర్తగాజనబ్రతిష్టించి । జినబుద్ధసమయంబులనుపెళ్ళుదుడిచి । మునులదీ
యుంచెనాయినుపక్రోత్రులను । కానకొలువుడుమాశ్రీనీలగళుని । కాని
నాడిందరగాలినకొర్ల । భువిదలక్రిందుగాదివియింతుననుచు । శివభక్తవ
ర్యుండుస్పష్టిక్వరుండు । నిశితఖడ్గాయుధాన్వితహస్తుడగుచు । పశువరిం
పుచుగొర్లపాలుసేయుచును । యంతలోశివభక్తులగుజినమునుల । సంతో
షచిత్తుడైటనగాచెగాదె । నిడుమూరుభూనాథునృదుభక్తిమహిమ । స
డిసన్నదెరుగవేగైనకష్టుండ॥

నమినందికథ.

మరియునునమినందిమాభక్తుడొకడు । వరలుచెల్లత్తిరువాలూరిలో
న । దిరిగియార్జించినేదెచ్చిభర్గునకు । పరుపడివేయుదీపములుముట్టించు ।
వ్రతతత్పరతబ్రతివర్తింపుచుండ । గుతగులైజైనులుగూడియియ్యార । భ
క్తుడొక్కడితనిబారగదోలు । యుక్తులెట్లనిపెక్కులూహించిచూచి । యు
ల్లపాడుగుడిసహస్రదీపంబు । వెల్లెడముట్టించునిదినిజవ్రతము । నీయూరని
తనికినెవ్వరునెయ్యి । బోయకుండినతానపోవెదుగాక । యంచునాలో
చించియతనికిఘృతము । నించుకయునుబోయనీకున్నవచ్చి । ప్రాణేశనె

య్యియుప్పాటనులేదు । ప్రాణముల్విడుతుదీపంబులారినను । యంచుబరి
చ్ఛేదియగుడునక్కెవు । డంచితప్రతిప్రత్యక్షమైనిల్చి । వరదసోమయ్యయ
ర్ఘ్యపణ్యాంబులందు । పరువడితొల్లిదీపములెత్తునట్లు । సజ్జనలీలమజ్జనబా
విలోని । యజ్జలంబులువోయనలరుదీపములు । కానకయన్యాయకారులై
యున్న । జైనులపసులునుసచ్చెదునేడ । యనిదేవదేవేశుడానతిచ్చుడును
వినిమహానందసంజనితాస్యుడగుచుకొలనిజలములుదెచ్చికోటిదీపములు । న
లరగముట్టించియాడుచున్నెడను। నరవంగనొక్క వెయ్యియులేకయుండ।న
రిమురిజనులెల్లహతమైనజూచి । యిదియేమిచోద్యమోయింతలోబసులు ।
మెదలవుకదలవుమృతిబొందెనల్ల । చాటిదేవరచేతబడసిదీపములు । కో
టానకోటియకొల్లలనినీరునను । ముట్టించినాడవేయిట్టిచోద్యంబు । పుట్టు
నెశివభక్తులెట్టివారుం(డొ।యిదినెయ్యివోయగనీకయుండినను , కటకటా
సాపించెగాకయత్తపసి । కాదెబిట్టకబిఱ్ఱుగాబసుల్సచ్చు । నాదీనదప్పేమి
పోదండుగాక । యనుచునేతెంచిసాష్టాంగులైమ్రొక్కి । వినుతింపుచుండ
నాఘనకృపామూర్తి । పశులప్రాణంబిచ్చిపరగజైనులకు । నొసగదేశివ
దీక్షయొారిజైనుండ ॥

## సాంఖ్యతొండనికథ.

వెండియువినుసాంఖ్యతొండండుచోడ ।మండలంబునశాతమంగయ
న్పురిని ।బౌద్ధునికడుపునబ్రభవించిపరిప్ర।బుద్ధుడైబౌద్ధవిరుద్ధసమ్మతిని।తొ
లిమేనితనపుణ్యఫలమునజేసి । వలగొనిశివభక్తివాసననిగుడ । భక్తుండనై
ననుబ్రదుకంగనీను । భక్తుండకాకున్నబ్రదుకుతానేల । యామటబదిటలిం
గార్చకుండనేదు । నామంబువినగరాదేమికర్మంబొ । యిట్టిభవద్భక్తిహీ
నుకడుపునను । బుట్టింపదగునయ్యభూతేశ్వరుండ । మేలయానన్నింతయీ
శ్వరుకరుణ । మాలిపుట్టించితిమలధారియింట । నిండారుసద్భక్తినినుభజి
యింప । నొండుపాయములేదొాగినట్లుగాక । సిద్ధంబువేదవిరుద్ధంబులైన।
బౌద్ధచార్వాకదుష్టసమయములు । మూడునునిర్మూలముగజేయుదనుక ।
మూడురాలనువైతుముప్పొద్దునిన్ను । నిదినిజవ్రతముంచునిలబ్రవర్తింప ।
నదివెళ్లివిరిసిమూన్నాళ్ళువారంగ । గుడికేగరామినిగుదగుదమనుచు । గు
దువకమూన్నాళ్ళుగడిచినపిదప । నేరుడొంకినగుడికేగియులేకట । నేర
నేమిటికిరాలెన్నివైచినను । మిసిమింతుడవుగావున్నడదేవయేను । విసివితి
నివియేలవేయుదునునింక । నీయొకటిటియబాలుబోయనిపెద్ద ।రామెత్తికొ

సిపోయికోయనివైవ । శివలింగమంతలో జేతులుసాచి । యవుదలబడకుం
డనాగినవ్వుచును । మెచ్చితివగమునీకిచ్చితినడుగు । మిచ్ఛమెయ్యదియనని
లజ్జాగిమ్రొక్కి । హరియునుబ్రహ్మయునాదియంత్యంబు । పరికించికానని
యురులింగమూర్తి । వేనవేల్విధముల వేదంబులరసి । కానక వేదకేడుఘన
లింగమూర్తి । సకలసిద్ధాంతశాస్త్రపురాణయుక్తి । నికమిట్టిదనరానినిజ
లింగమూర్తి । సనకసనందనమునిముఖ్యవితతి । మనములుగడచినమహాలిం
గమూర్తి । శేషవాసుకిబహుజిహ్వావ్యక్తవినుతి । భాషలుగడచినపటులిం
గమూర్తి । కంటిమీశ్రీపాదకమలంబులేను । మంటిచాలదెనాకుమరియొం
డచేల । మల్లెమొగ్గలవ్రేయుమదనునివేడ । వెల్లిగాజూచినవేల్పవునీవు ।
రాలవైచినగరుణాలోకనమున । భావించితివిభక్తిపరునిగానన్ను । నన్యా
యమునసీకుసహితంబుసేయ । ధన్యత్వమిగిచోద్యముగాడెజీయ । స్తుతి
యునునిందయుహితమునహితము । మతిదలంచిననుసమానముల్గావె । భ
క్తవత్సలభక్తపరతంత్రభర్గ । ముక్తివల్లభదయామూర్తివిగాన । నిందిం
చినంబన్ననీగుణకీర్తి । జెందిమల్హణుడునుజేరరెనిన్ను । కావ్యనననుగటాక్ష
వ్రేక్షణమున । భావించియీరాయిపూవ్వురోయిగను । యలవడనీయుత్తమాం
గంబుదెసను । నెలమినుండగజేయుమెల్లగుళ్ళందు । ననుచునవ్వేదబాహ్య
పుమార్గములు । దునిమివైవజైనసాంఖ్యతోండదుజైన॥
మరియుకోవూరిబ్రహ్మయనాగనొక్క । కరకంఠుభక్తుడఖండిత
కీర్తి । జినమునులకుదనకునుదర్కమైన । జినసమయవాదమునసిగ్గువడి
యు । పటమహీజాతమచ్చటనున్నమరియు । నటుగాకదృష్టమివ్వటముగా
ల్పెదవో । పడనెదోచెప్పుమాభక్తుండవనిన । మడియింపగూడదేబడనెద
ననిన । మంత్రతంత్రములచేమర్రిగాల్చినకు । మంత్రకుయంత్రకుమాయాప
హారి । వసుధనీర్రైయున్నవటముపైనపుడ । భసితంబుజల్లియప్పటియట్లని
లిపి । వరలగగోవూరివసదులన్నియును । జెరపడేబ్రహ్మయ్యసిగ్గేదిజైన ।
మరియునువినుపొట్లచెరువనుపురిని । వరలగనేణ్బూరువసదులుగట్టి । వెల
యున్నిరువదివేల్జినమునులు । గొలువగజినకులగురుడొక్కరుండు । నా
బల్లహునకుముఖ్యాచార్యుడగుచు । దాబుద్ధిజెప్పుచుధరబ్రభోదింప । క్షితి
పతియైనయాసింగబల్లహుని । యతివసుగ్గలదేవియకలంకచిత్త । తానును
జేవరదాసయ్యవరద । మానూనసద్భక్తిమానసగాన । తమగురుస్వాము
లౌదాసిదేవునకు । రమణియాస్థితివిన్నపనుజేసిహితుల । బుచ్చుడునప్పుడ

ప్పోట్లచర్వునకు । నచ్చెరువందంగవచ్చునయ్యెడను । జినమునుల్పెకుఁతు
చ్చితములు సేయఁగనిమాకుచును లెక్కఁగొనకేగుదేర । నగ్గురుశ్రీచరణాం
బుజంబులకు । సుగ్గలదేవియుత్సుకలీలమ్రొక్కి । భామగురుప్రసాదామృ
తాంభోధి। లోముదంబారఁదేలుచు మునుంగుచును । వేగొకటావునవిడి
యుంపనతడు।మీరివచ్చుటయటమీదనెట్లగునో।యనివచ్చిజినమునుల్వనుపింప
రాజు। జినసమయుడుగానవనితకిట్లనియె। సతికొకగతియును పతికొకగ
తియు। నతివయేలోకంబు నంజైనగలదె। యెక్కడిగురువులుయేనాఁటిబు
ధులు। చకఁననువుమజైనులువిన్నవిపరీతమగునింకవేయును సేల। చపలా
క్షియనువుమీసాములవనిన। యధికకోపోద్రిక్తయైవీరిరాక। యధమజైను
లపెంపులడపనేగాదె। పురుషునకుసతికి తెరువొకటైన। గురుశిష్యులకు వేరె
తెరువులుగలవె। స్త్రీవివాహమునాడుచేసినబాస। నీవవిచారించికోవే
యు నేల। గడియుంచికోభార్యగలదేనియార్తు। విడువుమునన్నునేమృడుగా
నియొల్లి। కాదేనియోడింపు వేదశాస్త్రాది। వాదితర్కప్రతివాదంబులందు
నంచునుసుగ్గలదేవిమించిపల్కుడును। కుచ్చితులగుజైనకూళలందరును।పిలిపిం
చబల్లహుకొలువునవారి। వలపటనవరత్న కలితమైపరగు। సింహాసనాశీ
నుజేసియాజైనసంహారుడైనట్టి సద్గురుదేవు। దాసయ్యపాగమల్లాసియొ
త్తుచును। నాసుగ్గలవయుండె నాజినమునులు । మంత్రతంత్రానేకమా
యాదులనుగు। యంత్రమహేంద్ర జాలాదివిద్యలను।నద్వైతశూన్యమా
యావాదకర్మ। విద్వేషమునజైనవితతితర్కింప । వేదవేదాంతాదివాదసి
ద్ధాంత। వాదతర్కములసంపాదించిమించి। న్యాయవైశేషికాద్యఖిలవా
గ్ధిలప్త। ధీయుతోక్తులబెడఁగుతెరగులుసూపి ।నద్వితీయుడు రామనాథుడేక
ర్తసద్విధిసర్వమునశ్వేశ్వరుండు। శ్రుతియేకమేవరుద్రోయనితత్త్వగతిలిం
గమధ్యేజగత్సర్వమనియు । రతిలింగబాంహ్యాత్పరంనాస్తియనియు।సతత
మునిటుశ్రుతుల్వాఁడెడుగాన ।యీక్షింపనింతయునీశ్వరమయము । ధక్షత
గల్గైనాతర్కింపుడనిన ।నింకదర్కింపగనేదియంతయును । శంకరుడనియె
డుసచరాచరములు ।పలదుపోగుడికేగికొలిచెదమనగ ।గలడంతటనుకరకం
ఠుడుమరియు ।నంగజహరుడు చరాచరంబులకు। నంగమోజీవమోయా
త్మయోచవుమ ।యనినశ్రవణులారయాదిశ్రుశ్నకును। వినుడుత్తరంబనివెం
డియిట్లనియె ।నీరాష్ట్రముల కెల్లనీరాజుదకఁ ।ధారుణిమరిచెప్ప లేరను టె
ల్ల।నోలిసమస్తపిపీలికాదులును ।మాలబుబోయలుమహీపతియను టె।సర్వే

శుసుగుణవిచారితవృత్తి ।సర్వంబునందును సంకీర్ణపదమె ।యదిగాకవినుడీ
శ్వరాద్వైతమనుట।యిదియుసర్వాద్వైతమేయట్లుగాక- గుడికేగిమీకింక
గొలువనేలనిన ।వెడగుప్రశ్నకుమీరువినుడుత్తరంబు । సర్వగతంబైనచం
ద్రాతపమైన । సర్వశిలలునుండచంద్రకాంతంబు । స్రవియించునాకెంటి
సామరస్యమున । స్రవియించునేయున్నశైలములెల్ల । శిలలపైవెన్నెలక
లుగదేకలిమి । ఫలమేమియది ప్రాణపదనుగాదెట్లు । చంద్రికకొరకుత
చ్చంద్రకాంతంబు । చంద్రాశ్మముకొరకుచంద్రికయరయ ।సర్వగతుండ
గుశర్వులోపలను । సర్వంబునుండంగశరణునిమనసు । కరుగునేటికిసమ
కళగల్గుగాన । కరుగునేతక్కొననరులచిత్తములు ।నఖిలంబులింగమధ్యంబు
నలేద । యఖిలంబునుండియునందేమిఫలము । శరణునికొరకుశంకరుని
లీలయును । శరణునిహృదయంబుశంకరుకొరకు । మొదవుగ్రేవునుదన
యర్థియకాదలచు । మొదవునకటప్రాణపదముగ్రాకేవు । బ్రదుకుగా
వునరెంటిపరిణామమంద । మొదవుదాపనునెరుంగదుగ్రేవుగాని। మదిలిం
గభక్తసన్మథనంబునంద । బ్రదుకునెంతయుప్రాణపదముండునంత। స్వా
తివానగురియుజలములనెల్ల । నేతరిగనుగొనదీచినుకులకై । కానితెర్వాదు
నోరుగలచిప్పయొకటి । తానెల్లవానలదడియుచునుండు । నుభయసం
గతిజేసియుదయించురత్న । మభవునిశరణునియనువునసట్ల । కావునలిం
గభక్తస్నేహలీల । మీవశంబెయరుంగగావలులార । రమణమైనాడంబ
రముకాకలింగ । సమదనసుఖములజూడలేదింక । యంగమోజీవమోయా
త్మయోయనిన । వెంగలిప్రశ్నకువినుడుత్తరంబు।యంగంబుపూర్వకర్మాం
శశేషంబు । నంగంబుసుఖదుఃఖసంగతినెలవు। నంగంబుపుణ్యాపాపాలయుం
బట్టి। యంగంబుశివుడుగావదివోవనిండు । జీవుడుశివుడనిభావింతురేని। జీ
వుడుమలినుడుశివుడునిర్మలుడు । జీవుడుదుష్కర్మిశివుడునిష్కర్మి। జీవుడు
సకళుడుశివుడునిష్కళుడు । జీవుడుపశుమూర్తిశివుడుపశుపతి। జీవుడుము
క్తుండుశివుడుముక్తుండు । జీవుడుసభవుండుశివుడభవుండు । జీవుడనిత్యుం
డుశివుడునిత్యుండు। జీవుడశుద్ధుండుశివుడుశుద్ధుండు । జీవుడుమృతదుఃఖి
శివుడమృతుండు। జీవుడుసంసారిశివుడసంసారి । జీవుడుసందేహిశివుడసం
దేహి। కావునజీవుడుదేవుడుగాడు । పోవగనీడదిపోలువుగాదింక।నాత్మ
యుబరమాత్మయనరాదువినుడు । యాత్మదాబంచభూతాత్మకంబయ్యె।
నాత్మదాబంచేంద్రియాత్మకంబయ్యె। నాత్మదాదేహగుణాత్మకంబయ్యె।

నుండుగావునవాత్మయును గాడుశివుడ । ఖండితనూత్మ్నవికస్వరలీల। సకల
ముగపటనాటకసూత్రములను । ప్రకటించుచైతన్య భావంబుశివుడు। యం
దునణోరణీయ్యానజొచ్చి । సందులేకున్నట్టిశంభుడుశివుడు।నువ్వులలో
పలినూనియయట్ల । భావింపగాష్టంబుపావకునట్లపూనిపాషాణంబులోని
నుమట్ల। తానేత్రములలోనిదమూపమట్ల । నలవడబాలలోపలినేతియట్ల।
జలకుంభములలోనిచంద్రునియట్ల । తలపపూసలలోనిదారంబునట్ల । వెలు
గునద్దంబులోపలినీడయట్ల । ఘటపటాదులలోనిగగనంబునట్ల। పటికంపుశి
లలోనిభావంబునట్ల! వెలయబీజములోనివృక్షంబునట్ల। నలరుశబ్దంబులోప
లియర్థమట్ల। పర్వతంబులలోనిప్రతిశబ్దమట్ల। సర్వంబునందునుశర్వుండున
ట్ల। ముల్లుగుట్టతెరపియెల్లెడలేక। యెల్లచోదానయైయిట్లున్నవాడు।నీశుం
డుసకలలోకేశుండుగర్మ। నాశుండునాడురామేశుండెయనిన । యవునే
నిదాసయ్యాయఖిలంబునందు।శివునకుకలుగువిశేషంబులెవ్వి । శివుడునిత్యుం
డటయువియనిత్యములు । శివుడననిత్యుడోశివుడందులేడొ । శివుడు దైవంబ
టయువియు దైవములు। శివుడునదైవమోశివుడందులేడొ ।శివుడటేపశుపతి
యవిపశురాశి। శివుడునుపశువయోశివుడందులేడొ । యందొకటైనను
హరునిగుణంబు । చెందంగవలవదాయిందులోననిన। నన్యాయవాదులన
తగుజూచి। ధన్యుడుదేవరదాసియిట్లనియె । నూనియగాజేసినూలోనుదీ
ప॥మానువ్వులందుననలరునేచెవుమ। నువ్వులగల్గునేనూనియగుణము।నువ్వ
లలోపలనూనియలేదె। యూశునిగుణమేలసిన్నిటిబొందు। నీశుడుతానెట్టు
లిన్నిటనేడు । నువ్వులలోపల నూనియగలదు । నువ్వులుగలుగునేనూ
నియలోన । సర్వజ్ఞునందునసర్వంబునుండుసర్వజ్ఞుడుండునేసర్వంబునందు।
నీహేతువులకెల్లనిట్లుచూడుండు । నూహింపగాలేకయునుగలవిధము ।
మథనపక్వక్రియామానంబులందు । ప్రథితంబుగామీదపరముగన్పించు ।
కలుగంగవలెనన్నగలుగుజ్ఞానికిని । కలుగడజ్ఞానికివలెనన్ననైన। సర్వ
జ్ఞుడిట్లుండుసర్వంబు నందు । సర్వప్రమాణాది సంసిద్ధమిదియు ।
ననవుడుజినమునుల పహసింపుచును । మనము నదలపోసి మరియు
నిట్లనిరి। పెకుటెరుంగుటపెద్దమేలయ్యె। నికటమింతయుగూడనిటలాక్షు
డేని। కలుగునేమలమూత్రములువిడులావు। నిలమెట్టవచ్చునేయిదిజెప్పుము
ననకూడజైనులనెల్లకూశలజేసి। వౌడలువడునట్లుదాసియిట్లనియె। యెరు
గరేజైనులాచెన్నడుమీర। యెరుగనికార్యమేయిదిమీకుకొత్తె। మృడుడులేడ

నియెడుజడకర్మవాది। నడుతలమెట్టియేనడుతుమేప్రొద్దు । మనసిజహరు
డులేడనిపలుకు నధము। మనుజులనోళ్ళుమామరగడంబులకు । గింకిరిపడకు
డీబొంకనేనేగనింక నేమడిగినవనిట్లచెప్పెదము। భావింపనీరెండుటావులుద
కట। దేవదేవుడులేనిటావున్నదెట్లు। సకలంబుదానయైసకలంబునందు। ని
కముదాబొందనినేర్పరియతడు । సకలంబుబుట్టించిసకలంబునందు। నికము
దాబుట్టనినిర్గుణియతడు। సకలంబునడుపుచుసకలంబునందు । నికముదాన
డువనినిజవరియతడు। సకలంబుద్రుంగించిసకలంబునందు । నికముద్రుంగని
యుట్టినిత్యుండతండు। సకలముదనలోనసందులేకునికి । సకలముదుడిచెడు
జాణడతండు। సకలంబుదననిజాజ్ఞాప్రభావమున। ప్రకటించుసర్వజ్ఞభావ
కుడతడు। సకలంబులీలనిచ్ఛామాత్రనిలిపి। విక్రుతంబులార్చు వివేకియునతడ
కలిగియుంతటిలోనగలియునివాడు । కలడన్నవారికికలిగుండువాడు। తలపు
లమిగిలినతత్వంబువాడు । తలచినవారికిదన్నిచ్చువాడు । కొలదికిమీరినగు
ణములవాడు । కొలదియెరింగినకూడుండువాడు । వలపింపరానట్టివలతు
లవాడు । వినుమంతలోననవిహరించువాడు । దృష్టికిదాటినతేజంబువాడు
దృష్టించిచూచినతెలుపగువాడు । వాసనగడచినవర్తనవాడు । వాసన
మైగూడవర్తించువాడు । చవులకుమీరినసారంబువాడు । చవులబాసిన
దాబ్రసన్నుడౌవాడు । పలుకులగడచినబాసలవాడు । పలికినయట్లున్న
పైబడువాడు । భక్తవత్సలుడనబరగినవాడు । శక్తికీతుడైసడిసన్నవా
డు।యుక్తికిమీరినయుక్తులవాడు । వ్యక్తిసాక్షాల్లింగమైయున్నవాడు। కా
వునహాలింగదేవునిమహిమ । భావింపవలపమిప్రాప్తియకాదు । రామ
నాథుండుసర్వంబునునగుట । భూమినభక్తులబొందరుండుటయు। నప్రసి
ద్ధపుమాటలనవలదిపుడు । సుప్రసిద్ధముగదృష్టప్రత్యయంబు। చూపెదన
డుగుమీరోపెదరేని। యీపొట్లచెరువులోనెన్నగబడ్డ । వసదువేడ్మూరు
నుద్రవచ్చివైపింతు। పసులమిమ్మేమనిపరతునేననిన । యెన్నిమార్గంబులనీ
తనిజెరుప । కున్నగాదనిజైనులూహించిచూచి । దృష్టాంతమిప్పుడుదృష్ట
మాగాని। దుష్టోరగంబునదోడికింతమనుచు। వాసుకిమెచ్చకన్నాలునాలుక
లు। గోసెడుమనన్నట్టిఘోరసర్పంబు । కడవలోపలబెట్టికలడయ్యోయుందు!
మృడుసర్వగతుడనివాడిదెవదవనిన । కలడనుమానమేఘటములోపలను । క
లుగడేనియుసర్వగతుడైరామయ్య । యనుచునూతనపురాతనమహాభక్త
జనపాదపద్మసంస్మరణాత్ముడగుచు । నిర్భయుడైచేరినిలిచితద్గర్భ । గ

ర్భష్టమైయున్నదుర్భరోరగము। రోజుచుబొంగుచుమ్రోగుచులోన౯। దాజ
ప్పరింపుచుదౌడలడచుచును। నెడనెడగడవలెరాబడగడచుచును। గడవడిం
పుచుభుజంగమువిజృంభింప। రామనాథుండుసర్వగతుడవ్యయుడు। రామే
శుభక్తులీభూమినుత్తములు। పరముగొల్వనివారుపరమపాతకులు। నరులె
ల్లవింటిరేనాశపథంబు। నంచునాఘటముల౯హస్తంబుదోడిగి। పొంచున్న
సర్పంబుగుంచితివుచుడు। పటికంబులింగమైస్ఫుటకాంతిజేసి। చటులభాస్క
రకరపటలమంతయును। విటతటముగదిశాతటములుగప్ప। కుటిలాన్యసమ
యవిఘటనతదీయ। పటుతరకరతలఘటితమైవెలుగ। నటుగూడునరులుఖే
యునిజయవెట్ట।తటుకునజైనులుకుటిలతయడగి। ఘటితపాలస్థలకరకంజులు
గను।సుగ్గలదేవియాత్సుక్యంబుదనర। నగ్గురుదేవుడానగ్గింపుచుండ।బల్లహు
డాదిగానెల్లజైనులును। తల్లడంబందుచుధరజాగిమ్రొక్కిరి। యంతదేవరదా
సుమయ్యబల్లహుని। సంతోషమునలింగసహితుగాజేసి। యిటతర్కము
త్తరించుటజేసియుల్ల। పటికలింగంబునప్పట్టణంబునను। నుత్తరేశ్వరుడననా
గి(బ్రతిష్ఠించి। యుత్తరినాదాసుమయ్యనేణ్ణారు। వసదులుద్రవ్వించివై
చిజైనులకు। నొసగదేశివదీక్షయోరిజైనండు॥

హిరియనాచయ్యగారికథ.

మారుడిగనుపురిమరియొక్కభక్తు। ధారగహిరియనాచయ్యగారన
గ। పరులెఱుంగకయుండభక్తుడైయుండ। పరవాదిజైనులుప్రల్లదంబునను
నేలజూచినదామెమెలమినివెయ్యి। యేడునూర్వసదులకిదిపొడవనుచు। నొ
క్కశివాలయంబున్నద్రవ్వించి। చకరానచటిపూజారిగారింప। పరవాదిజై
నులబరపకయుంక। పరమునకారగింపగబెట్టరాదు। తప్పగుతడసిననిప్పరిన
నుచు। నప్పుడనాచిదేవయ్యదావెడలి। పదునాళ్ళలోననపం!డెండువేలు।
మదనారిసద్భక్తమండలిదాను। నెలమిదలిర్పవెన్న్యణ్ణారులింగ। ముల
బండ్లకెత్తించివలిపేగమునను। నడతెంచిచుట్టుమారుడిగిపైవిడిసి। బడుగు
బాపడుబట్టుపరదేశిమొదలు। తడయకజైనులుదక్కతక్కెరల్ల। వెడలుడో
యునిమెల్లనినగజాటించి। యుందులెరాడేరసులనబదముప్వ। రందరవారిం
చిహరభక్తులలర। తలపడితాకిజైనులగూడముట్టి। తలపట్లువట్టియుద్ధంబు
సేయుచును। తమకంబుమైతారతమతమశిరము। లమితకోపోద్రిక్తులైత
రిగికొని। మెలమినత్తలలుడాపలికరంబులను। వలచేతగరవాలములుఝళి
పించి। సొలగకత్యంతవిజృంభితులగుచు। నలరుచుదూగాడనలుగులువెలుగ।

గుని యుచు నాడుచు గోయని యార్వ। జినమునుల్భీతి మూర్ఛిల్లి వాపోవ। దును మాడి యాజినమునుల మోదుచును। కనికని శిరములు దునిమి వైచుచును। రూఢి హైయాడుచు బాడుచు వెయ్యి। యేడునూర్వసదులగూడ లెక్కించి। జినరూపముల తలల్చి (దుపలు చేసి। జినవసదుల మీది శిడములు నూకి। యొక్కొకక లింగంబు నొక్కొక్క వసది। నక్కజంబుగ నిల్పి యఖిలంబు నెరుగ। నారగదలలతో నట్టలు గూర్చి। ధారుణి వెలయలే తేరసులనగ। నాచిదేవయ్యాయనశ్వరమహిమ। నీచుట యెరుగవే నిన్నటివార్త! పాటివేల్పని మీరు పాటించు జినుని। చేసెరుంగ రెయొండు చప్పలేవింక। పరచుట చోద్యమే పశువుల మిమ్ము॥

## సోమన్నగారికథ.

మఱియును నాహుళిగర యను పురిని। శూలిభక్తుండు దాసోమన్న యన(ది। కాలంబు జేయు లింగస్పర్శనంబు। నేమంబుగా గోరి ఘామి వర్తింప। గా మరి యొకనాడు కన్నులు నొవ్వ। గడుసంకటంబున గానగ రామి। గుడికి బో నేరక కుడువకయున్న। తో నొక్కరుడ తప్ప తత్పురి నెల్ల। జైనుల కానయ్యా సంహ్యా భావమున। కుడువకుండగ నేల గుడికడ కేము। దోడుకొని పోయెద మడరగ నిప్పుడు। యంచు జైనులు దోడికొంచు తత్కార్య। వంచకుల్సురహొన్న వసదికి నేగి। మ్రొక్కుము వీడె మీ ముక్కంటి యనిన। గ్రక్కున జినుతలగరములు వెట్టి। పుడికి లింగాకృతి వడుపున నున్న। తొడగి ముమ్మారు (వేల్మిడి మ్రొక్కి మ్రొక్కి। వలగొని సర్వాంగములును సంధిల్ల। నిలజాగి మ్రొక్కిన నింక లేజాలు। జినుడు ప్రసన్నుడై తనుగొల్వనిచ్చె। పని లేదు మా బుద్ధి విని యిట బ్రదుకు। మనవుడు సోమన్న యాగ్రహంబంది। జినునికి గినునికి చేతు లెత్తుదునె। చాపన్నలార సాక్షాల్లింగమూర్తి। జూపెదరండంచు లెవ పలికేగి। కన్నుల గట్టినకవణంబు వుచ్చి। మున్ను లేచుచు బల్మి గన్నులు దెరువ। నట మున్న జినరూపమట యిట బాసి। పటపటవగలుచు నిటయటవడగ। నిటలతటాన లెరాలకటచటిలాక్షు। డట జిన ప్రతిమ మధ్యంబున నిలిచె। ఖ్యాపితార్వా చేసరూపంబు దనర। గోపతివాహును దేవుదలిర్ప। సురహొన్న వసదిన సోమేశుడనగ। పరగ మా సోమన్న భక్తికి మెచ్చి। ముంజేతి కంకణంబునకద్దమేల। భంజింపబడు జినప్రతిమయ సాక్షి। యిల ప్రసిద్ధము నేడు నెరుగుదుగా డెహుళిగర లోపల నోరి జైమండ॥

## వైజకవ్వకథ.

వెండిబరవళిగ వెలది వైజవ్వ । ఖండేందుధర పాదకమలాంతరంగ।
మగడాదిగా బురి మనుజులందరును। వగువ గజినమార్గవంతులై నడువ। నా
తిమగం డొక్కనాడు జైనులకు। ప్రీతితో బర్వంబు బెట్టు నయ్యెడను । దరళా
క్షి బదపదార్థములు సేయించి। వరుడు జైనుల బిలువంగ బోయినను। దరుణి
యొనప్పదార్థములు వీక్షించి। సూరమూర్తినొక జైనరుగు జేడయ్యె। పరికింప
దాజేయు పాయసాన్నములు। పరమేశ యితరుల పాలయ్యెననుచు। కడుగ
డుదుఃఖాగ్ని గ్రాగుచునున్న। మెడదపోవేషి మైన్నృడుడయే తేర । వడతి
యొకడు భయంపడియప్పుడులికె। వడివడి సంతోషపడి చక్కజాగ। బడిపలు
మరు మ్రొక్కబడి పాదధూళి బడి పొరలుచును పైబడి వైజకవ్వ యాదిదేవుని
మూర్తియగు తపోరాజు। పాదంబులు గడిగి ప్రాసించి మ్రొక్కి । సముచిత
సత్కారసంపద దనిపి। యమలిన దేహు సుఖాసీను జేసి। పదపదార్థంబులు
బక్వాన్నములును। కదళీదళంబిడి కన్నుదనియగ । వడ్డింపదపసి మైవడి నార
గింప। సద్దులు సేయుచు జప్పరించంగ । సంతోషమున గుహ్వజను డెంచె జై
ను। లంత కాంతకమూర్తి నల్లంతెగాంచి, యంతనము గుడికి పోనధిపుడేతెం
చు। నంత దపస్వియు నట్లదృశ్యముగ। వా సోసి వైజి తాపసి మొందణంగె, గా
సి పడక చూపుతుషణుల చేత । కన్నంతటను జూడగాదను దపసి । కెన్నెడద
లుగ గ్గైనిటు గుడ్వబెట్ట । గూడు నేతనయిల్లు పాడుచేసితివి । మేడదాచితి
చెప్పుబూడిదె గొట్టి । మగని యాజ్ఞకుమీరదగు నెయిక్లేమి । తగులమో
కాకయత్తపసికి నీకు । సమ్మతంబగు నేసిచ రుమని యతివ । సమ్మోటగొని
చాటుచాటున వైవ । నతివయు లెక్కసేయక శివుదలప । పతి వేఁయు వేఁ
ళ్లెల్ల సతిమీద బడక । పిట్టారగింపడ జెట్ట శంభుండు । పిట్టవ్వకై రాచ వెట్టికి
బోయి । సోలు చువాఁలుచు వేలగింపుచును । నాలంబు సేయుడు గోలలవా
చు । నలుకమైవడుగ పొమ్మని వేఁయు వేఁట్లు । కల చూచోడని యోగము
దాకునట్లు। వసదులునిండగ వాడల నడుమ। మసలిన తమ జైన పసులను దాక
త్రెళ్లు నుగట్టి ముచ్చట్లు నుజుట్టి। వ్రేట్లతో డనతమవీపు త్రోళ్ళగయ। నులికులికి
వీగి పీపు బువిర్చికొనుచు। కెలకులరయుచు జేతులు నొగ్గికొనుచు । నురికి కురికి
పడి యబ్బురమిదియనుచు। వెరపీకులందుచు విభ్రాంతులగుచు। హాయనిజ
డియుచు పరితపింపుచును। వాయెత్తి యేడ్చుచు వసదు లెక్కుచును। నందుం
డి యూఁగుచు నైద వెట్టుచును । సంగుల కేగుచు గ్రింద సొచ్చుచును। చెరువుల

మునుగుచు జెట్లవ్రాకుచును। పరచునొండొరుమరుపుసొచ్చుచును। వ్రేళ్లుకుసు
లుకుచువిహ్వలులగుచు। త్రేట్లంటిచూచుచుతమకర్మమనుచు। జినువెన్కడాగు
చుజిక్కితిమనుచు। కనుకనిచనుచు నెక్కడజొత్తుమనుచు। వచ్చెజావనుచు దైవ
మెరుంగుననుచు। నొచ్చితిమనుచును వెచ్చనార్చుచును। తలలుగుండులతో డదా
కించుకొనుచు। నిలబడిపొరలుచు నెట్లకోయనుచు। తొరగెడిమేని నెత్తురులంటి
యుంటి। బొరిబొరిజూచుచుజొక్కితిమనుచు। జొరచోటులేదంచుసొమ్మసిల్లి
చును। హరుకృత్యమా కాక యనుచునిబ్బంగి। సంతాపమున వ్రేల్లజైనులవా
రల। నంతలోనొకబుద్ధిమంతుడీక్షించి। చాటుననొకవ్రేటుసతి వ్రేయజాటి।
చాటుననీ జైనకోటి డాకెడిని। యక్కజంబుగ మునినాంతులువోలె। నొక్కొక్క వ్రే
టువేయుముఖముల్గాగ। శ్రీచంద్రమునివోయి చక్కువపాలయ్యె। యాచార్య
మునివోయి యుగడికెబడియె। వరచంద్రమునివోయి వసదెక్కయురికె। నరహం
తమునివోయి యడవులగలిసె। క్షపణేంద్రముని ప్రాణముపతాపమందె। విపు
లేంద్రమునివీపువిక్కనవిరిగె। రాజేంద్రమునిబిట్టు ప్రాణంబువిడిచె। సీజిన
కులగురుడింతలోబాలిసె। నంతయుగూడనొకింతనైమెమడసె। కంతుసం
హరుచైదిగానోపుననుచు। నతివకడ్డముసొచ్చి యతనివారింప। నతగుల పైబ
డునవ్వేటులుడిగి। భార్యసద్భక్తి తాత్పర్యరాలగుట। యార్యేతరుడెరింగి
యుల్లైరుగనటు। లన్నంబువెట్టితిదన్నన్నమున్న। దన్నెరుంకయుండదపసి
కొకటనికి। యటుగాక నీక్షించితందరనిప్పు। డిటమునీంద్రులకెల్ల నెగ్గుచేసితి
వి। ముదిగొరగలమంత్రములు మంత్రములును। మదిమదినిన్నేలబ్రదుకంగని
చ్చు। వెరతుము తమయిల్లు వెడలుపీవనుచు। నరిమురిదోరియుడునవ్వైజకవ్వ।
చనుదెంచిచనుదెంచి జైనాలయంబు। గనిశివాలయమిదిగానోపుననుచు। వని
తమున్నిలువెలువడమిగా జేసి। కనివసదియును గుడియును నెరుంగమిని। ము
క్కంటిశరణంచు మ్రొడ్డుగేలమర। ముకుచువసదియమ్మద్దిమగడియు
నటుజిన ప్రతిరూపప్పుడ వ్రస్సి। నటయితవడగనందభ్యంతరమున। నదయిం
చెనద్భుతాస్పదలింగమూర్తి। ముదితసమ్మదితసమ్మదలీలదనర। పురుషుడు
శివభక్తివిరహితుడేని। పురుషునిమీరుటతరుణికిపథము। దుర్గతిబొందదెం
దును పతిబాసిభర్తనిగొనియాడుపడతికిసట్లు। చనగనాలాయనీయను మునిభా
ర్యయనసూయయుబురుషుడునభర్తుడైన। బాసిశంభునిగొల్చిబడసెనుగాదె
భాసురంబగు మోక్షపదము వేండియును। నిలయెల్లనెరుగగదిలకవ్వనాక। వె
లదియీశ్వరభక్తివిముఖుడైనట్టి। మగనిబాయుడువాడు దెగనున్నయెడను।

మొగిదిశివాలయంబింతిచొచ్చుడును। వెనుకొనియేతెంచిపెనిమిటిశివుని। వె
నుకదాగిననాతిగినియుచుగొంగు। వట్టితీవపురుషభావమైయుండె। నెట్టణశి
వభక్తిశిష్టగాజేసి। యనుచుజెప్పగవిందుమాద్యోక్తులందు।కనుగొనబడిమె
నీకాంతసద్భక్తి।యనియసంఖ్యాతభక్తావలివొగడ। జననికాయంబుఖేయని
జెయవెట్టి। నాజినమునులెల్లనాశ్చర్యమంది।వైజకవ్వకుమ్రొక్కి-వడిబ్రస్తుతిం
పవైజవ్వభావోద్భవంబొటజేసి। వైజనాథుండనవసుధలోవెలయు। ధాత్రిజి
ల్లులెఱుగవేబరవళ్లగందు। వైజకవ్వనుహిమరొజైనకూళ। చన్నసద్భ
క్తులశౌర్యాతిశయము। లెన్ననంతంబులిన్నియునేల। నాటిలింగమునే
డునవిసెనేచెపురు। నాటిభక్తిచుహిమనవిసెనేనేడు। చిటిపొటిసమయం
బులిటువంటివడప। నటపెద్దలేలనేమైనజాలుదము। గబ్బునజైనమార్గమె
యాదియనుచు। యిబ్బందిజినమునులీయబ్బలూర। మెట్టిమాతోప్రతిఘ
ట్టించియాడ। నెట్టణవాదంబునిల్చిగెల్చినను। నటఃపోవదింకప్రత్యక్షప్రమా
ణ। మిటుచూపుమాయనియటుముదలింప। హిరియవసదినాగబురినెన్న
బడ్డ। యరుజినాలయమినుడుదయమానంత। లోననగోడలతోడనగూలి
తానవ్భుమీవేల్పుతలయునుబగిలి। నేలపాలమ్యెనేనియుసీశుబంట। జాలు
బోయిదియదృష్టముచూడుడనుచు। వచ్చినంతటిలోనవసదియుగూడ।
వ్రచ్చివందరలాడువడుపునద్రెళ్ళె। జినురూపమంతదుత్తునియలైపడియె।
జినులజైనులునునాశ్చరంబునొంద। నిలువదప్పరిగూలునేడునువసది। యి
లమెల్లనెఱుగరేయిన్నియునేల। ముదిలంజపడుపట్లముందటికథలు। పద
రిచూపుగలేనిపందనేనేగు। వరకీర్తిమొరటదవంకయ్యగారి। వరవుడబిరు
సనవచ్చునేనాకు। యిప్పుడశిరమిచ్చియిప్పుడమగుడ। యొప్పనేపడయుగ
నోరిజైనుండ। యిప్పుడుశిరమిచ్చియేడుదినంబు। లిప్పురవీధులనెల్ల
నుమెరసి। తలవడయుదుధరాస్థలియెల్లనెఱుగ। తలతలచూడనుకలదు
శాశక్తి। యటమీదగల్యాణకటకంబునందు। నటయిటచుందునకైనలేకుం
డ। వసదులన్నియువ్రచ్చివందరలాడి। వెసజినప్రతిమలవిసమాల్తునిదియ।
బాసమిమ్మిరుగాలిపసులనింకొండు। జేశిననింకొండుసిద్ధియుగలదె। య
నవుడునట్లకాకనియొకరొడెసను। జినసమయస్థులుజేరిచూడంగ। బసవ
డుసహితంబుభక్తనికాయ। మెసకంబుతోగొలువిచ్చికూర్చుండ। నాబి
జ్జలుడుతంత్రమప్పురాంతరము। నాబాలవృద్ధాములంతంతజూడ। నచ్చె
రువందనేకాంతరామయ్య। కచ్చించికొనియంకకాడునుబోలె। దరహాస

కాంతివర్తిమునఁదొల్కాడ । నరుదొందభక్తగణాళికిమ్రొక్కి । యార్చి
బొబ్బిడిపొంగియలుగుకంఠమున । జేర్చిక్రుమ్మడియొక్కచేతసంధించి ।
యాసురంబుగనల్లునప్పుతట్టకును । బాసిశిరముకేలబావుబాపనగ । బసవ
డుకీర్తింపభక్తసమూహ । మసమానలీలఁగోయనిపొంగియార్వ । త్స్మాతలే
శుడుశిరఃకంపపూర్వముగ । చేతులురెండునుశిరమునఁదాల్ప । వారకజయ
జయధ్వనులుఘూర్ణిల్ల । పౌరజనములువిభ్రాంతులైచూడ । నవికలపవి
ధవాద్యధ్వనుల్చెలఁగ । వివిధనాటకమహోత్సవముబొల్చార । వలచేతనలు
గుడాపలిచేతశిరము । దులుకాడవీధివీధులమెరయుచును । గతులువెట్టఁగదా
శిగతులకాడుచును । క్షితిగతారముమీదఁజేరినిల్చుచును । శరణార్థిసేయుచు
జయవెట్టుడనుచు । బిరిగొనియార్చుచుఁబెడబొబ్బలిడుచు । నిప్పాటఁగలయం
గనేడుదినంబు । లప్పురిమెరసియేకాంతరామయ్య । వచ్చియప్పటిగుడివాకి
టనిలచి । వచ్చెనాబాసశ్రవణులారయనుచు । నేకాంగవీరుడలోకానుసారు ।
డేకాంతరాముడప్రాకృతకర్మి । చక్కనశిరమట్టసంధింపదడవ । యొకింత
యొకదెసకోరవోయుండె । హరుడువేల్పగుటయేకాంతరామయ్య । శిరము
లోకులకెల్లఁగురియన్నయట్లు । ఏకాంతరామయ్యశ్రీకరమహిమ । లో
కాంతమయ్యెద్రి లోకంబులందు । ప్రత్యక్షమీతఁడేపరమేశుఁడనుచు । నత్య
ద్భుతాక్రాంతులైజనుల్వొగడ । కడుదురాత్ములజూడగాదనితమకు । పె
డమొగంబిడెననిభీతిల్లునట్లు । జనపాలకునిచేతజయపత్రమిచ్చి । జినసమ
యులువచ్చిశివభక్తవితతి । ముందటిదెసజాగిమ్రొక్కఁగబడిన । యందరి
మొగములయందచ్చులొత్తి । యారిచిపెడబొబ్బలందందనిడుచు । వీరమ
హేశ్వరవితతియుప్పొంగి । వెనుకొనినసదులువిరుగగొట్టుచును । జినప్రతిమ
లతలల్చిదిమివైచుచును । నసమానలీలఁగళ్యాణంబునందు । వసదియుజిను
డనువార్తలేకుండ । కసిమసంగియుజంపిగాసివెట్టుచును । వసుధలోజినుల
నువారినందరిని । నేలపాలుగజేసినిఖిలంబునెరుగ । కాలకంఠుభక్తగణస
మూహంబు । యనుపమశౌర్యునేకాంతరామయ్య । ననురాగలీలమైగొని
యాడుచుండ । ననయంబుబసవడుదనసంగమేశు । డనిభక్తిగొల్వనేకాంత
రామయ్య । వరకీర్తిమైయిట్లువర్తింపుచుండె । ధరలసద్భక్తివిస్ఫురణమై
మరియు । ప్రథితుడీయేకాంతరామయ్యదివ్య । కథవిన్నవ్రాసినగారవించి
నను । జలహాలహాలవహ్నిశస్త్రాస్త్రబాధ । నలినాగమృగరోగములభ
యంబణగు । విపులదృష్టాదృష్టవివిధసౌఖ్యములు । నపవర్గములుగల్గుహ

రుక్పపజేసి॥

## షోడ్డలదేవుకథ.

ధీరుడుషోడ్డలదేవుబాచయ్యగారునావెండియుగరకంఠమూర్తి। నిర్గతేం
ద్రియవైరివర్గదుర్గుణుడుభర్గనిరర్గళాంతర్గతధ్యానియుగాశ్రితభక్తగణాగ్ర
గణ్యుండు। నిగ్రహానుగ్రహోద్దాదగ్రశౌర్యుండు। కష్టజనాశ్లిష్టదుష్టజనారి। శిష్ట
జనానందపుష్టిపాలకుడు। దుర్భావరహితుడగర్భసంభవుడు। నిర్భరాశ్రయు
డపునర్భవశాలి। శాంతుండుదాంతుండుసదమలభక్తి। కాంతుండునిర్జితా
వాంతరసమయు। పరదైవపర్వతప్రథితదంభోళి। పరదైవసందోహతరుకు
ఠారంబు। పరదైవశుండాలపంచాననుండు। పరదైవవార్ధిశుంభత్కుంభజుండు।
త్రినయనునతులితోద్రిక్తశౌర్యంబు। చనునందికేశ్వరుసర్వజ్ఞతయును। భృం
గినాధునియేకలింగనిష్టయును। భంగిగానవీరభద్రురౌద్రంబు। భృగుదధీచ్యా
దులపృధుశాపశక్తి। తగుగౌతమాదులతర్కప్రయుక్తి। గురునాధుడిన్నియుగూ
డబాచాంకు। వగదివ్యమూర్తిగావిరచించెనొక్కొ। కానినాడిటువంటికలియు
గరుద్రు। మానితపృధుదివ్యమహిమయెట్లొనరు। ననుచులోకంబులత్యర్థగీర్తిం
ప। నను రాగలీలనూనినభక్తియుక్తి। సిద్ధాంతములశ్రుతిస్మృతిమూలములను।
బద్ధవేదాంతసంపాదితోక్తులను। న్యాయవైశేషికాద్యఖిలశాస్త్రముల। నాయ
తబహుపురాణాగమార్థముల। సహజానుమానాదిసర్వప్రమాణ। బహుతర్క
వాదజల్పవితండములను। వెలయనుత్పత్తిస్థితిలయకారణుడు। నలరునిత్యానం
దుడంబికాధవుడు। పశుపతితాగర్తపలువేల్పులెల్ల। పశువులేయనిప్రతిపాదన
చేసి। జినసమయస్థులశిరములుదునిమి। ఘనువిష్ణుసమయులముక్కులుగోసి
యద్వైతులనహతాహతముగదోలి। విద్వేషవాదులవిటతటమార్చి। చార్వా
కవాదులగర్వంబడంచి। సర్వేశుభక్తియేనుర్విసిష్టించి। దిట్టయాషోడ్డలదేవు
బాచయ్య। యిట్టిసద్భక్తిమహిష్ఠుడైనడువ। యెడనెడసౌరాష్ట్రమేగియేటే
ట। కడునర్థితోడజాగరముచెల్లించు। దినమేగుదెంచుదుదివుటసౌరాష్ట్రమున
జాగరముసేయజనియెదననుచు। బిజ్జలునకువినుపింపగనతడు। కజ్జమెంతే
సియుగలదుపోరాదు। కొట్టరువునబళ్ళుగొలువగవలయు। నిట్టెలచెల్లునీకిరు
దెసకొలువు। బాలెంతలంజియపడుపట్లరాచ। యూళిగంబునుభక్తియును
గూర్చినడువ। సౌరాష్ట్రమునకీవుచనముకాదేని। సౌరాష్ట్రనాధుడుచనుదే
రనిమ్ము। శివరాత్రిగివరాత్రిసేయుటమాను। తవిలియూయుళిగంబుదప్పింప
రాదు। యనుచునప్పరవాదులనుమతంబునను। జినపతివారించుదునుపోకనిలి

చి। ముదలించి పలుకుడు మూర్ఖుడైపోక। యదియు కష్టముగా దేయతడన్నయ
ట్లు। వచ్చునిచ్చటికొండెవరదుడు నాకు। నచ్చటికేగునట్లయ్యెడునొండె। డీనద
ప్పినదేమి నానిజవ్రతము। తానెట్లు శివునకు దప్పింపవచ్చు। ననునిశ్చింతాత్ము
డైయున్నయెడను। ఘనుడు సోమేశుడా దినము తొల్నాడు। మడపు లేఖయు
నందిపడగయు గొనుచు। పడిహారిక్రియ పట్టపగలయే తెంచి। కొట్టరువునబ
ళ్ళుగొలిపించుచుండ। నట్టిచో బాచయ్యకాతడిట్లనియె। సౌరాష్ట్రనాథుండు
చనుదెంచుచుండె। భోరున ముందటబుత్తెంచె నన్ను। శంకరు నానతిచదువుకో
లేఖ। యింకిటు ప్రాటకు నేగుదెంచెదును। నాసక్తిమైయింకననిశంబు మీని।
వాసంబుననయుండ వలయు గావునను। నీపెద్ద గాదియ లోపలికొలుచు।
వేపోవబనుపుము వెడలి సోమేశు। డచ్చోట ప్రత్యక్ష మయ్యెడు ననుచు।
నచ్చుగా జెప్పుచు నతడదృశ్యముగ। చనుదెంచు నిచటికి సౌరాష్ట్రనాథు। డసు
మానముడుగుడీ యది యెట్టులనిన। వచ్చెనేము నున్న రావణుని మన్నించి। య
చ్చోనజీక్క గాకని పల్కవలదు। భక్తుడేయతడు తపఃఫలోన్నతిని। శక్తిసం
తుడు గాక చర్చించి చూడ। భక్తుల చేపట్టు వడుగాక శివుడు। భక్తిహీనులకే
లపట్టిచ్చు శివుడు। విలసితసద్భక్తి లలి మెచ్చి కాడె। యెలమి గుడ్డవ్వకు నెదురు
గావచ్చి। కదలకక్కడజిక్కగాడె సోమేశు। డడియేల నావిందెగను పురంబు
నను। గావున జూడంగ గందుమి ప్పురిని। దేవుని రాకకు దృష్టమిచ్చటికి। పడి
హారిభావనబర తెంచె నతడు। యదరసౌరాష్ట్రనాయకుడు గానోపు। సకళ
నిష్కళరూపసన్నుతశక్తి। నికమెట్టిఫణిహారులకునున్నదెట్టు। వచ్చెనిట్లాన
తియిచ్చెనెంతయును। నచ్చెరువుగ యెల్లయరుదెంచుచుండె। యిటయదృ
శ్యుండయ్యె నీశుండ యనుచు। కటకంబు నరులు విఖ్యాతి సేయంగ। తవిలిసమ్మ
దసముద్భవవారి గ్రమ్మ। శివుని యానతి లేఖ శిరమున దాల్చి। పురుషడ్డుశుభ
ముగా విరచింపబంపి। కరమనురక్తి బాచరుసు వేడినను। బసవయ్యమొదలు
గాభక్తులు దాను। వసమయాడ్క్షోలగంబై యున్నయెడను। వింత చెన్నానంద
విభ్రమంబెసగ। నంతంత బాడంగ నంతంత నాడ। నదె వచ్చె వచ్చె వియన్మం
డలమున। నిదె వచ్చె వచ్చె సోమేశుండనంగ। నీరథు లేచుఘూర్ణిల్లనభాతి।
సారగంభీర వాద్యారవంబెసగ। భోరున మ్రోయుచప్పుడు వినబడగ। సౌ
రాష్ట్రనాథుడాశ్చర్యంగబెలర్ప। తివిరికొట్టరువు గాదియ వ్రచ్చికొనుచు। భు
వి బ్రతిష్టంబయ్యె నవనికంపింప। సిద్ధరామయ్య దా శ్రీగిరి కేగి। శుద్ధాత్ము మల్లి
కార్జునుని ప్రార్థించి। కొనుచు నా సొన్నలిగెను పురంబునకు। కననిట్లు

